క. అయ్యన్నదమ్ములిలలో నెయ్యము దియ్యమ్ము లెసఁగ నెగడుచుసుతులన్
వెయ్యారులందు సరివే రయ్యా యనఁగనిరిఘనుల నరిదవఘనులన్. ౧౦౪
శా. శ్రీలక్ష్మీలలనా సరస్వతులచేఁ జెన్నొందుటం బూర్వపుం
గాళిదాసు జయించి మించి విలసత్కల్యాణ చారిత్రుఁడా
కాళీదాసునకున్ రమాసదృశరం గన్మూర్తిమైమొప్ప స
చ్ఛీలప్రస్ఫుటవృత్తియా విజయలక్ష్మీదేవికిం బుత్రుఁడై
హేలన్వర్ధిలె వెంకటప్పసచివుం డీశానసద్భక్తుఁడై. ౧౦౫
సీ. మందారబిసబృంద కుందారవిందాబ్జ చంద్రమోచచ్ఛాయ సడలఁజేసి
శర్వపర్వతబలా ఖర్వసుపర్వార్వ గీర్వాధూరుచుల శం కింపఁజేసి
హీరవారపటీర చారుతారానీక తారహారస్ఫూర్తిదప్పనట్టి
శారద వారిద నారద పారద శారసత్కాంతులఁ బాఱఁదోలి
గీ. భువనములునిండ నెవ్వ నిధవళకీర్తియతఁడుపాత్తూరివంశాబ్ధిసితకరుండు
వెంకటప్పాఖ్యసచివుండు విశ్రుతుండు ప్రబలెఁ బ్రబలుచునున్నాడుప్రబలగ
లఁడు. ౧౦౬
చ. అలయకపొత్తురి న్వయసుధాంబుధి చంద్రుఁడు వెంకటప్ప యీ
యిలఁగల యాచకప్రతతి కిచ్చుటఁ గన్గొనికల్పభూజ మా
కులపడి పండ్లిగిల్చె శశికందును గుందును జెందె నెందుగ
ర్జలుకసురున్వహించెఁ బెలు చన్జలదంబు సహింపఁజాలమిన్. ౧౦౭
క. తగు వెంకటప్పసచివు నిమిగులంగలకీర్తి వెలసె మృగభృన్నగభృ
న్మృగమృగభృన్నగనగభృన్మృగభృన్నగభృత్సుతల్పమితరింబబగుచున్. ౧౦౮
శా. శరదభ్రాభ్రధు నీమరుత్తరువనీ శర్వాబ్జభూభామినీ
శరనీహారకరాబ్జినీ విచికిల స్వర్ధేను సద్రాదినీ
శరధీశాన సమానకీర్తిలహరీ సంపూర్ణలోకాళియై
పరగెం దాఁ బెదవెంకటప్పజలధి ప్రఖ్యాత గంభీరతన్. ౧౦౯
గీ. అట్టి పెదవెంకటప్పకు నగ్రమహిషి యేకవంశాబ్ధి చంద్రుఁడై యెసఁగు నట్టి
పుండరీకాక్షు సత్పుత్రి పుణ్యగాత్రి ప్రకటదుర్గాప్రసాదాంబ భవ్యశీల. ౧౧౦
సీ. పంకజాత నివాస పారుష్య సహితయౌశ్రీకాంత సాటిగాఁ జెప్పనెట్లు
సతతంబు వేధతో సాంగత్య మొనరించుభారతి సమముగాఁ బలుకుటెట్లు
చండికా భిఖ్యయై శైల సంజాతయౌపార్వతిసరిగ నేర్పఱచుటెట్లు
పాంసులత్వనిరూఢి బహువర్ణకలితయౌభూదేవి పోలికఁ బోల్చుటెట్లు

గీ. సునతదుర్గాప్రసాదాంబ ననుపమాన పుణ్యనిరుపద్రవాగణ్య భూరిసత్త్వ
నిర్మలాకారయుతఁగని నిఖిలజగము పొగడుచుండును దద్గుణస్ఫూర్తిదలచి౧౧౧

సీ. ఘనసర్వమంగళా కలితసత్సద్మయై ఘనసర్వమంగళా కలనఁబూనె
సత్యభామా సమాసక్తిచే వివరించి సత్యభామా సమాసక్తియయ్యె
కమలాంచితేక్షణా కలితయై చెన్నొంది కమలాంచితేక్షణా కలితయయ్యె
వరపద్మరాగ సుందర రదనాఢ్యయై వరపద్మరాగ సుందరతఁదాల్చె

గీ. నమితగుణచర్య వేంకటప్పాఖ్యసచివ వర్యు రెండవభార్య వివర్ధితార్య
సుమహితౌదార్యసంతత సుగుణకార్య చిన్నదుర్గాప్రసాదాంబఁజెప్పఁదరమె.

గీ. తనర కుశలవరామయ్య తనదు పెద్దభార్య పెదలక్ష్మిదేవ్యాఖ్య భవ్యశీల
యట్టిసతియందు సుతుఁగాంచె ననఘకీర్తిఘనుని నానందరాయు సజ్జనవిధేయు

క. ఆనంగజలధిచంద్రుం డానందమనంగ నందమందెను వినయ
శ్రీనందుఁడు భక్త్యర్చిత శ్రీనాథుఁడు భరితబాధు బృందుండగుచున్. ౧౧౪

మ. హరినారీమణి సత్యభామ వచనం బాలించి మున్నామరు
త్తరువున్ ధాత్రికిఁదెచ్చినాఁడనుచుఁ బెద్దల్సెప్పఁగావిందుమా
తరురాజంబగు పారిజాతముసుమీ ధర్మాత్ముఁడానందరా
వరయం జాటుచు నున్నదీవియడ నీయర్థబు తథ్యంబగున్. ౧౧౫

క. ఇల బ్రహ్మానందాదుల ఫలమేమో భాగ్యమేమో పరికింపవలెన్
గలుముల బలుముల నొసఁగెడు నలయక పొత్తూరివంశ్యుఁ డానందముదాన్

సీ. చెఱకువింగిణి నెందుఁజేఁబూనాఁడో కాని యనవిఁజరించు పుష్పాస్త్రుఁడితఁడు
ఉరముపైఁ గందెందు నునిచినాఁడో కాని యిలఁజరించెడు నోషధీశుఁడితఁడు
పరతాపకరత నేపట్టున నిలిపెనో వసుధ వర్తిలెడు పావకుఁడితండు
తనయాకులత నెందు దాఁచెనో ధారుణితలవర్తియైన సంతాసమితఁడ

గీ. టంచు సౌందర్యకీర్తిప్రతాపకనూతి వితరణమ్ములనెల్లరు వినుతిసేతు
రట్టిపొత్తూరి కులకలశాంబురాశి చంద్రు నానన్దరాయ మంత్రీంద్రు సభల.

ఉ. ఎందుఁబరోపకార గుణమేతన నేమము గాఁగనెంచి యా
నందముతోఁ బరోపకర ణమ్మొనరింపుచు నాసికెక్క నా
నందము జిత్తవృత్తి యను నందనపాదరవిందసేవ నా
స్పందతనిప్పటిల్లఁగుల పానను వైపితృభక్తి పెల్లుగన్. ౧౧౭

క. ఆనందరాయసచివున కానందద యగుచు వెలయు నగ్రమహిషిసీ
తానందనామవతికిని సానందుఁడు వెంకటప్పజననంబయెన్. ౧౧౮

సీ. తన దానధారాంబు ధారాసారవృష్టికిఁగవిజనమ్ములుచాతకములుగాఁగ
దన యశః కర్పూరమునకు బ్రహ్మాండభాండంబు గ్రోమ్మించు భరిణగాఁగ
దనప్రతాపాదిత్యధామవిస్ఫురణకుఁజటులారినృపులు చీఁకటులుగాఁగ
దనదయారససుధా వనధికి సద్గుణ గణహితబ్రాహ్మణుల్మణులుగాఁగ
గీ. బ్రబలెమంత్రియతండు దుర్మంత్రినికర గర్వదుర్వారతిమిరసంఘాతహరణ
తరణికిరణుండు సంతత దానశౌరి మహిత చినవేంకటప్పాఖ్య మంత్రివర్యుఁ.
గీ. ఆగుణాంబుధికి హనుమాయమ్మయనఁగఁ దనరుఁ బద్మాక్షి భార్యయైధర్మ
నియతి ననుసరింపుచు వర్తింప నఖలధర్మ కార్యములఁజేసి సత్కీర్తిఁ గాంచి
మించె. ౧౨౦

గీ. రమ్యతరకీర్తియానంద రాడ్ద్వితీయ భార్యసీతమ్మనామ్ని యహో పణతియందు
గాంచెఁ బుత్త్రిని మూడవకాళిదాసువాగ్రహౌదార్య శౌర్యసంపత్సమగ్రు.
క. ఆనందరాపు మూఁడవ మానినియగుసర్వలక్ష్మి మధుభిత్తరుణీ
సూనాయుధ హరరమణీ మానిత వనజజసతీ సమానతలంపన్. ౧౨౩
క. అయ్యానందము ననుజుం డయ్యారే సిరికి ననుజుఁ డందమునననన్
నెయ్యములమూటయై వీరయ్యాయనందనరు నిజకు లాభరణంబై ౧౨౪
ఉ. అప్పయమంత్రి యాత్మసతియైవిలసిల్లిన రాజ్యలక్ష్మియం
దొప్పఁగరామచంద్రుఁడన నొప్పెడి పుత్త్రునిఁగాంచె నాతఁడే
తప్పకవార్నిధానములఁ దద్దయునించెను దానధారలం
జొప్పడరన్ యశస్సితిని సోమునిఁ బూర్ణునిఁజేసె నెప్పుడున్. ౧౨౫
క. ఏవంవిధసరసగుణ శ్రీవారాన్నిధులు చతుర శృంగారకళా
ప్రావీణ్యంబులమెఱయఁగ భావమురంజిల్ల ధరణి పాలకులెల్లన్. ౧౨౬
ఉ. ఎవ్వనిరాజకార్యముల కీతఁడుదక్షుఁడుకాఁగలండొ నాఁ
డివ్వసుధాతలంబు సక లేప్సితదాయకమానటంచు లో
నువ్విళులూరుచుందుగుస ముజ్జ్వల తేజుఁడు కాళిదాసుమే
ల్మవ్వముఁగాంచి యట్టినృప మాన్యతనొంది చెలంగెధారుణిన్. ౧౨౭
౧౨౮
వ. అట్టిసమయంబునందు.
సీ. శ్రీలువర్ధిల వాసి రెడ్డివంశాబ్ధికిఁ జంద్రుఁడై విక్రమోపేంద్రుఁడగుచుఁ
బరమపావనమూర్తి భవ్యతేజోమయ ప్రబలకాంతిచ్ఛటా భాస్కరుండు
స్తంభశైలారి భాస్వద్దుర్గదశక ప్రపాలనాధాంకిత ప్రాభవుండు
శారదాభ్రతుషార చంద్రచందనచారు కీర్తికర్పూర పంకిల దిశుండు

గీ. కవిత్వదారిద్ర్య దీర్ఘాంధకారలీలలాలితానేక విబుధ రించోళి వెంక
టాద్రి భూపాలమౌళి కృపానుభూతి కాళిదాసుని రావించి ఘనతమించి. ౧౨౯

ఉ. మాకుఁ బ్రధానివై సకల మంత్రిగణంబునఁ బెద్దవై మద
స్తోక మహీతలంబునకుఁ దోడుత దక్షతనూని డెందమ
వ్యాకులతన్ భాసంగఁ బరిపాలన సేయఁగఁగోరి నార మి
చ్ఛాకలిత ప్రవర్తనుఁడవై భరియింపుము రాజ్యభారమున్. ౧౩౦

శా. ఏనేనీవయి యేలుకొమ్మనుచు భూమీశుండు వల్కంగ న
మ్మౌనిగ్రామణి వీటినందుకొని త న్మంత్రిత్వముంబూని య
మ్లానప్రౌఢిమ నంగసప్తకము శుంభల్లీలఁ బాలించె సం
స్థానంబింద్రనివాస భోగముల మెచ్చె హెచ్చ నుచ్చైర్గతిన్. ౧౩౧

* లయగ్రాహి. *

ఈసు మదినెఱుఁగఁ డొక వీసమును నేమఱడు
రాసులుగఁ గూర్చెసిరి యాసపడ డెందున్
గాసిఁ గనుపడనీడు మోసపఱచం డొరుల
దాసులై జనులు తను వేసరకగొలువన్
గ్రాసములొసంగి ద్విజ వాసములు నిలిపి పెఱ
దోసములడంచి మృదు హాసుఁడగుకాళీ
దాస పరిపాలనపు వాసి వినరింపఁ దర
మే సురలకైనఁ దివిఁ జేసెఁగద పుడమిన్. ౧౩౨

క. చోళద్రావిళ కురుబంగాళ కరూశాంగ వంగ కాశ్మీర కనే
పాళ క్రథకైశికములఁ గాళీదాస ప్రధానిఘనయశ మెసఁగెన్. ౧౩౩

చ. నల నహుషాది భూపతుల నాఁటి యశఃప్రసరంబు ధర్మవృ
త్తులు నురుభూసురార్చనలు దుర్జనసంహృతి యాదిగా నిరా
కులమతి వెంకటాద్రినృప కుంజరుఁ డాసచివైకతానుఁడై
సలిపె ననేక శిష్టహిత సత్క్రియలశ్రమతన్ ఫలింపగన్. ౧౩౪

వ. అమ్మంత్రి పుంగవుం డొక్కనాఁడు ప్రసంగవశంబున మమ్ముం బిలువం బంచి మాకుం బ్రకటయశస్సంపత్ప్రదాయకుండైన శ్రీవాసిరెడ్డి వెంకటాద్రిమహీవల్లభుని వంశావతారం బభివర్ణింపుఁడని సత్కరించిన మే మభివర్ణించితిమి. అట్టిక్రమం బెట్టిదనిన. ౧౩౫

మ. అల వంశోత్తమ ముదుఁ బాండుర సమాఖ్యన్ సాధు వృత్త ప్రచా
రులు సన్నాయక భావనారస సమా రూఢ ప్రకాశుల్ మహో
జ్జ్వల కంఠస్తవనీయ కీర్తులగు రా జద్రాజ రత్నంబుల
త్యలఘుల్ బుట్టిరి సద్గుణాదృతి ననర్ఘశ్రీల రాజిల్లుచున్. ౧౪౪

సీ. వారిలో దుగ్ధాబ్ధి వారిలో శ్రీకాంతు పోడిమి వీరపనేడు మెఱసె
సములలో బలుమందసములలో బహులక్షలార్జించి ధనమునిండారగూర్చి
హితులతో డగుపురో, హితులతో మనసార సమకేందరి భోగంబులనుభవించి
వనములాశ్రితుల జీవనములవ్వారిగ సకలస్థలముల రాజ్యములు నిలిపి
గీ. పగరనణగించి మస్తుభానగరుపాగరు మీరుమేటిజమీయతు మెఱయభువన
భవన లీలావిహార శుంభన్నిగుంభ కీర్తి లక్ష్మీ మనోహర స్ఫూర్తి యమ్యె.

ఉ. వీరపనేడు కత్తి ఝుళిపించి రణాగ్రమునందు దూకి ప
ల్మారు చకాపికీ నరకి మార్తుర వేలుపు ప్రోలి కంపి న
మ్మారుని పోరుటం దల సి మార్మొగమై జలదాంత రంబులన్
గారు మెఱుంగులం బిలుపు గాంచె చెలంతురు నేడు నచ్చరల్. ౧౪౬

సీ. ఘన భుజార్గ ళనిర ర్గళఖడ్గ ధారాళి ఖండి తారాతి రాణ్మండ లుండు
సర్వ సర్వం సహా చక్ర నిర్వక్ర సం రక్షణో పాయ దీ క్షాదక్షు ముంగు
నిఖిల ధర్మా ధర్మ నిశ్చయా నిశ్చయో ద్దీప్త విద్యా తత్వ దీర్ఘ వేది
సురదంతి దంత భాసుర వజ్రదీప్ర ప్రభా విభాసిత యశః ప్రసరసరసు
గీ. డహ మహమికాహవాభి క్రమాను మోద మేదురమనో వినోద గంభీరవిక్ర
మైక దుర్వహ సాహసుం డవనిననుచు నియతిగాంచెను వీరపనేడు నాడు.

ఉ. వీరపఁ నేడరాతి పృథి వీపతి రాజ్యము లందు సంపదల్
జేరప నీడు చెల్వుఁపు ప్రసిద్ధి జయంత వసంత కంతులన్
దారపనీ డశేష జనతా ఘనతా పరిపాటి మేటులం
గూరప నీడనాఁగ సరి గోరుట దూరుట మేర గాదొకో. ౧౪౮

శా. చట్టాలెల్లరు మెచ్చ భూసుర వరుల్ చుట్టుం దనుం గొల్వఁగా
గట్టాప్రుల్ జిన్నరించు నోగిరము బంగారంపుడాల్ పప్పునన్
దట్టా లూరుచు నెయ్యి దోడ్పడిన స త్రంబుల్ ధరం నిల్పుచున్
గట్టా వారికి నల్లుఁడై యతఁడు విఖ్యాతిం గనెన్ భూస్థలిన్. ౧౪౯

మ. నరలోకేశ్వర యుద్ధశక్తి మతిస న్నాహ స్థిరుండైన య
న్నర లోకేశ్వరు రాణి సత్య వచనా నందాబ యందంబుగాఁ
బతి పూర్ణోజ్వల భాగ్య సంపదల మెప్పై వీరలక్ష్మీ మనో
హర నామాక్షర భాజ నంబగుచు నుద్య చ్ఛోభ రాణిం చెనున్. ౧౫౦

సీ. రాజ యోగ్యత లేదురమణి వాసమునందు దనమందిరము రాజదర్శనీయ
ము మపుట్టినింట గం డోద్వృత్తి కెడలేదు తనపుట్టి నింట భద్రములుదరుచు
రతికాంత కును సాంగ పతిభక్తి చాలదు తనదు పాతివ్రత్య మనుప మాన
మవిరత క్రూరాత్మ భవలీల ధరఁజెందు దనమనం బుపకార తత్పరంబు

గీ. ననుచు లక్ష్మీశ్వరీ వాగ్ధ రాంగనను మించి నిజనాథు కూర్మిగణించి శిరుల
నలరి పతికినిలోగి యయ్యతివ దనరె వీర లక్ష్మమ్మ జగదేక వినుతి గ్రిమ్మ.

ఉ. ముద్దులగుమ్మ కొమ్మనర మోహనశక్తి యనంగ నన్నిటన్
దిద్దుగడల్ గడల్ కొనఁ బతిం రతిసంపద నోల లార్చుచుం
గద్దరి సింహడింభముల గట్టడి రట్టడి సేయు పుత్రులం
బుద్దుల ప్రోక లంగ నియె బోడిమి వాడిమి మీర మువ్వురన్. ౧౫౨

గీ. ఆదిశక్తి మహేశ్వరు నంశ మునను గార ణత్రయి గన్నట్లు కనియె రామ
భూతలాధీశు రాఘవ భూమినాథుఁ జంద్రమౌళి క్షమాపాల చంద్రునామే.

ఉ. ఆవసుధా ధరత్రితయ మందు గనందగు సందపుం సిరిన్
భావభవుం జయించి సుల భమ్ముగ నిష్టవిభూతు లొంది స
ద్భావిత సర్వమంగళ త భాసిలి రామనృపాలుఁడెల్ల ధా
త్రీ వలయంబు నేలుచు బ్రతిష్టుతుఁ డయ్యె బుధాళి మెచ్చఁగన్. ౧౫౪

క. తమ్ములు సుగుణమ్ముల మొ త్తమ్ములు విక్రమ కథావ ధారిత హరిసా
తమ్ములు దనుగొలువగ సత తమ్ములు తనసిరులుగాఁగ ధారుణినేలెన్. ౧౫౫

చ. హలినిహసించి కౌముది యొ యార మడంచి కపాలిఁగాంచి చు
క్కల మగనిందలంచి మిహి కా తతినొంచి సురదురినెంచి య
వ్వలి మలనేవగించి సుర వల్లభ హేతి నధఃకరించి య
య్యలఘు నికీర్తి వర్ధిలెది గంతర దంతురి తాట్టహాసియై. ౧౫౬

మ. మలరాజేరులగడ్డ వత్సలయియ మ్మర్నీనికల్ దిండిజూ
పలమానుర్వ లిగొండకల్లు కొలన శ్యారావుమాణిక్యరాల్

సీ. కట్టించినాఁడు పో, గట్టువిల్తునిగుళ్లు, ఘట్టించినాఁడు కా, త్రపులవేళ్లు
పాలించినాఁడువి, ద్వత్కవివ్రాతంబు, లాలించినాఁడు లీ, లావతులను
సాగించినాఁడన్న, సత్రవ్రతంబులు, భోగించినాఁడింద్ర, భోగపదవి
రంజించినాఁడుప్రీ, రప్రతాపరణాళి, భంజించినాఁడుష, ద్వర్గకుమాన
గీ. రాజమాత్రుఁడె చౌదరీ, రామనృపతి, తనయు లార్వురు జగదేక, ధర్మవిజయ
శౌర్యగాంభీర్యసరససౌం, దర్యశాలు, లతికృపాళులు చెలువొందు, రవనిలోన.

చ. చతురుఁడు నీతివిద్యలను, జాణపుఁ డింగిత భావ బోధలన్
రతుఁడు పరోప కారములఁ, బ్రౌఢుఁడు రాజ్యరమాను భూతులన్
హితుఁడతి దీనరక్షణల, నేర్పరి యర్థముఁ గూర్చుచో సకల
ప్రబల యశుండు వీరవర, పాలుఁడు భాసిలె వారిలోపలన్. ౧౬౬

శా. పాంచా లాదిక భృత్స భావిధుమసీ, పాంచాలి కాపంచనా
చంచత్ప్రౌఢ విభావి భాసురయశ, స్సారుంపు సీమంతినీ
పాంచాలుండగు వీరభద్రవసుధా, పాలుండు వాలించెనో
రంచద్విక్రమ కేళులన్ రిపులమా, యం జేసి భూమండలిన్. ౧౬౭

సీ. అంగ వంగకళింగ, బంగాళ నేపాళ, పాంచాల నృపసభా, భవనములను
సౌవీర సౌరాష్ట్ర, శకశూక లాశ్మంత, మరహాట నృపసభా, మందిరములఁ
గ్రథకైశికవిదర్భ, కాంభోజ ఘోట్టాణ, కరహాట నృపసభా, గారములను
చోళ కేరళగౌళ, మాళవ మద్రకాం, కణసింధు నృపసభాం, గణములందు
గీ. వీరభూపాలు గుణగుచ్ఛ, విసరణములు, మధుపకీమళసప్తులా, మంజుమధుర
మధుర సాస్వాద నోన్మాద, మదములీను, కవుల కానస్థ కోరకాం, కములు
బెరయు. ౧౬౮

ఉ. కొంగు పసిండిమై కవుల, కుర్కమణీ భూషణ పట్టుచేల మా
తంగతురంగ కాంచనవి, తానము లప్పన సేయువేళలన్
బంగరుకొండ గవ్వపఱి, పాటిగ దా నిరతార్థి సత్కృపా
పాంగతరంగి వీరవర, పాలుని చేతికి నిచ్చువేళలన్. ౧౬౯

సీ. అర్థిసార్థమున, కత్యర్థ మర్థములిచ్చు, తటిసహస్ర కరుండు, తానయనఁగ
నృపసభావ్యాహార, రింఛోళిదుమికించు, తటిసహస్రముఖుండు, దానయనఁగ.

సత్రశాలావిమ, ర్శప్రచార మొనర్చు, శతసహస్ర పదుండు, దాన యనఁగ
ఘనధనై ధనసుసా, ధనపరీక్ష లొనర్చు, శతసహస్రాక్షుండు, దానయనఁగ
గీ. బహువిధాభూభరణశక్తి, పాలనాతి, భోగములనల్లయగుచు, సం,పూర్ణకామి
చెలఁగె శ్రీవీరభూపాల,సింహమనని,ఁజనుల మాధ్య్వహారము,లహాజములుగ.
చ. నలువసురద్రుమ పంచకము, నగ్రగమపద్ధతి వేఱువేఱ శా
ఖలనయిదింటిఁ జేకొనిజ, గమ్మనగమ్మనవార్త సజ్జనో
జ్వలతకు వీరభూపకర, సర్గముఁజేసి ని సర్గపాణిమం
జులతర పంచశాఖ పద, సూనృత మూనె నటంచు రీవ్రులన్. ౧౭౧
మ. కరుణాసాగరుఁ డాన్నపాలుఁడు జగ, త్కల్యాణి పూబోణిబిం
భరవేణిం గలకంఠవాణి జలరు, ట్పాణిన్ బుధశ్రేణిమె
చ్చురహిన్ రాణిగఁ జేకొనెన్ విజయల, క్ష్మినర్ణ స్వదివ్యోపభో
గర సోల్లాసము లెచ్చఁ గాంచి సిరులన్, గందోయి కెందమ్మగన్. ౧౭౨
సీ. ఏయింతి పూబంతి, సేవగించునుమేనఁ, గుదురైనవాసనా, ఘుమ్మఘుమలను
ఏబోటి జంబోటి, నెగ్గించు నిజకళా, సరససారంపరీ, చకచకలను
ఏకొమ్మ రాబొమ్మ, నీసడించెడినన్య, పుసపావలోకన, స్ఫూర్తులందు
ఏకల్కి మరుముల్కి, యేకాంతమునఁ బ్రాణ, నాథునిగరగించు, నడవడులను
గీ. దేవులందును బట్టపుఁదేవులందు, దరముగలదంచు వచియింపఁ, దరముగాదు
నాయికారత్న మగుచునె, న్నంగఁ దగిమె, విజయ లక్ష్మినమాఖ్యనా, వి
క్రమ మొప్పి. ౧౭౩
క. అద్దం పతులకు నిష్టపు, ముద్దుకు పూరుండు గలిగె, మోహన రేఖన్
గద్దించి మరునినైనసిరి, దిద్దించగలట్టిదివ్య, దీధితి గులుకన్. ౧౭౪
శా. రారయ్యా కవులార! తాపకవచః, ప్రారంభ సంరంభసం
భారగ్రంథ కవిత్వ తత్వకలనా, ప్రౌఢప్రసంగావళీ
ధారన్నవ్యసుధా ధరీకరణబో, ధగ్గొల్పె సర్వార్థముల్
చూరల్గాఁ గొనుఁడి, చ్చెదంచనుటచే, సూరయ్య నాఁ దగ్గెఁ దాన్. ౧౭౫
సీ. మందారవితరణా, నందుఁడంమరుజనుల్, శనిభూసుతులుదాస, చతురమతులె
హారికుమారమనోహ,రాంగుఁడందురు మహేంద్ర,శిఖివాహనుల క్షేమిచెలువుగలను

రాజహంసయశోభు, రంభరుండగయండు, రింద్రసూర్యులయశం, బెద్దికనగ
కమల భూశేమషీ, కతనులింతురు వ్యాస, తొన్నతలంబు లబ్ధి, గరిమగలదె
గీ. యనుచుసర్థాంతరోక్తిని, హ్నానమొనర్చి, జగతినాయస్సు తాపస, శక్తిభోగ
భాసుచిత్యవమాన్యద్ధిపటుతసామ్య, సూక్తిసూరయ్యకెంతురు,సూరిజనులు.
క. తారులు వారుదవాగ్ముల, ధారాధర పటలిపగిది, దప్పించినది
తొన్నరమణుల పొదయూడ్చుచు, సూరయ్య పరాక్రమమును,సూరి దెన్యోడా.
చ. ధరంబరి తాపమూని కర, ధారల జీవనముల్ హరించున
త్తరణికి వేయుచేతులిసు, ధాతకు తట్టసి దప్పెభో వసుం
ధరపరి తాపమూర, గిర, ధారల జీవన ముల్ ఘటించుభూ
వరమణిమైన సూరసర, వల్లభు నిర్మితి;సేయుటకా బళా. ౧౭౮
ఉ. పండితపోషిసూర సర, పాలు కృపారచితంబులై జగ
న్మండలిరంజిలెకా వితరణంబులు సత్కవి కంఠభూషలై
పండిత కర్ణభూషలయి ప్రస్తుతి పాత్రతగాంచె స్వర్ద్రుమా
ఖండలనై చికీగుణచ కచ్చుకమచ్చిక పిచ్చలింపగకా. ౧౭౯
చ. బలరిపు భూజరాజి వన, వాసమునకా, బలియారసాతల
స్థల వలనుబునకా, జలద సంఘము కూటగతావనాప్తినా
కులతలం జెంది, హ్రాస్వగతి, గుంది, జడాత్మతనొంది, ప్రొందుట
య్యాలఘుండు సూరభూమివిభు, నబ్బ:పు!కీవికి నోడియేకదా. ౧౮౦
శా. మట్టైకా నైరినృపాలజాల మకుటీ, మాణిక్య రింఛోళికల్
కట్టెందత్తదనంత రాజ్యములంజ, క్కాందోరణంబుల్ ధరం
బెట్టైకా భూసురపాళికి సముచితా, భీష్టాన్నముల్, మెచ్చిచే
పట్టైకా గోరిక నచ్చమాంబ యనున, ద్వ్యాఖ్యాపూర్ణ రాణికా. ౧౮౧
క. ఆకడలింగలుమ్మల నవ లాకరణిని సమ్మతకర కలా దరవర ర
త్నాకల్పాన్విత పుత్రం, బాక కులాంభోధియచ్చ, మాంబతనర్చెకా. ౧౮౨
క. పులిజున్ను పుట్టతేనెయు, గంపుట్టిల్లయ్య నవనెం గాంతుని బికిలెం
బుల నుసుయని పుట్టెలున, త్తిలుసిరిగనియచ్చమాంబ, దీప్తింబర గెకా. ౧౮౩

ఉ. సమ్మతు లంపురాంబలజ, గమ్ములనిమ్మలఁగాంచ మొక్కొయ
కొమ్మల ధర్మవర్తనల, గూడిక వాడిక కెక్కె సంపదన్
గమ్మనివిల్తు తల్లి సరిగా విరళించి సమస్త భోగముల్
కొమ్మని విప్రకోటికిని, కోరికలొందిన యచ్చమాంబయున్. ౧౮౪

సీ. ధరణీసురులలోనఁ, దా చుట్టెంతియుకాని, ధనముపెట్టియులలోఁ, దా చనేర
నతిథిసంఘములను, బ్రాపఁ బెంపటగాని, ప్రియభక్తులనుకొడల్, బెంచు తెఱుఁగ
దిరు పేదలకుగ్రాస, మిడికూర్పటయుకాని, కొల్చుకొట్టులలోనఁ, గూర్పుఁ తెఱుఁగ
వెల్లబాధువులకుఁ గొల్లఁబుచ్చుటకాని, రాజభోగములయా, రాటమెసఁగ

గీ. వెట్టుసేర్చెనో కృతకృత్య, వృత్తిహత్తి, మత్తిలు నరాతులకు నెత్తి, మిత్తియైన
యట్టిసూర నృపాలుకాంత, తావతంస మచ్చమాంబికఁ గొని యాడ, నౌ నెజగతి. ౧౮౫

క. మన్నిలనిన్న యన్నసూ, రన్నకునచ్చమ్మయందు, నాత్మజులు గుణా
భ్యున్నతులు దయించిరినర, సన్నయు రామన్నయనఁగ, సరసాగ్రణులై. ౧౮౬

క. అన్నృపులిరువురుఁ జనసర, సన్నయుఁజసరామలింగ, శౌరియునని ధా
త్రిన్నగడి రాజకులముల, మిన్నలుమన్నింపఁగీర్తి, మెరసిరి సిరులన్. ౧౮౭

సీ. డిండీర డింభోళి, తెక్కునెక్కులుపుచ్చి, ఘనహిమానీద్యుతుల్, కసరివైచి
శరదభ్ర రేఖకా, సంభ్రాంతిమాయించి, శారదారుచిపాళిఁ, జక్కఁబెట్టి,
కౌముదీ విలసనా, కర్షణంబొనరించి, కలశ పాథోరాశి, కలతపెట్టి,
విబుధ సింధురకుంభ, విహారణశ్రీఁజెంది, సింహడింభములపైఁ, జిందుద్రొక్కి

గీ. సురతరులనెంచి జిగిమించు, సొంపుఁగాంచి, చిలువ రేనిగాటి గడిదేరి, చెలువ మూరి
రాజనందన శేఖరి, రాజమాన, రాజనందన యశమువా, రతఁజెలంగె.

క. ఆరాజ కుమారులలో, ధారావర వితరణైక, ధారాపతినా
ధారాధర జయలక్ష్మి, పారమువని రామలింగ, భరిమృఘఁ డలరెన్. ౧౮౮

సీ. తనువను మిత్రతనూజా, ధ్యానాతసంచరణైక, వృత్తిచేసార్థకీ, కృతిపహింపఁ
వనుముహూర్తము నాలు, దర్శనశ్రీలచే, సహూర్తాన్య సుకృత్తి, సరసీజూపఁ

దమ విపక్ష తబంధు, తాదూర సుచార, భావమ్ము ననిసర్గ, పదవి నెఱపఁ
దమదస్య శబ్దార్థ, తత్పరత్వమునిశా, విహరణమ్మునసార, విహ్వలతఁ గఱప
గీ. ననని జినరామలింగ, ధరాధినాధు, వైరులతిభీతి మలఁలో, పలవసించి
రచ్చలకుఁ బాసి పోషిత, భ్రమణ మెనసి, చౌర్యమున జీవనము సల్పు,సాగిర
పుసు. ౧౦

క. అర్థులకుం దార్కొనఁబ్రబ, త్యర్థులకుఁ స్వస్థవృత్తి, హత్తించిసిరుల్
వర్ధిలఁగ రామభూవిభు, డర్థింబురు షార్థసమితి, నార్జించెనిలన్. ౧౧

సీ. జయముచేఁబరలోక, భయముచే ధర్మని, ర్ణయముచేసరపాల, నయముచేత
ధనముచే విబుధవ, ర్ధనముచేఁ బుణ్యాప్తి, ధనముచేఁ దత్వ మం, డనముచేత,
జలముచేసునభుజా, బలముచేఁ బటుతప, ఫలముచే జగమెచ్చు, కులముచేత
శమముచే బంధుసం, గమముచే విభవసం, క్రమముచే విషయసం, యమము
చేత,

గీ. ననుపమాన ప్రభావభా, వానమంగ, సంగతి చిరంత నాఖిల, సమితి మీఱ
వెలసెఁ జినరామ లింగభూ, విభుఁడు స్వాంత, రంగబహిరంగ శోధనా,భ్యర్హ
గతుల. ౧౨

సీ. పర్లగడ్డకులాబ్ధి, హిమకరా కారుఁడౌ, కోదండ రామరా, ట్కులమణికిని,
నందనిమైబుధా, నందకోరకపుంజ, మాజ్యమైన భావనావతంస
మలివేణిగంగమ్మ, యనువ ధూమణితస, పట్టంపు రాణిగాఁ, బ్రబలి సిరుల
నరులఁ దన్పుచుశక్తి, నరుల దున్మచునత్రప, తీవ్రప్రతాపసం, దీప్తుఁడగుచు
గీ. తన్మాతలాగత కల్పవృ, క్షంబనంగ, హితుల నతులాను భావసం, జితుల సుకవి
తతులనక్షయభోగసం, గతులఁజేసి, యలరె శ్రీరామలింగనృ, పాధినేత. ౧౩

క. ఆరామ లింగనృపతిమ, హారామ తటాక వాటికా, రాలయ ముఖశో
భారమ్య సప్తసంతతి, నారూఢిఁ బ్రతిష్ఠఁ జేసి, యలరె ముదితుఁడై. ౧౪

మ. క్షితి సంతానము రామలింగవసుధా, సీమంతి సీవల్లభుం
డతులైశ్వర్యధురీణుఁడై యువాహరా, యత్త క్రియాకౌశలిన్
సతతోత్సాహమె లర్చఁగాను భయసం భావైక మూలంబుసం
తతిలేమిన్ మనెఁగుంటి కోవిదులకో, ధర్మైక గోష్ఠీరతిన్. ౧౫

క. సరస మనోహర మతిబం, ధురగంభీరార్థ భరణ, ధూర్వహమభితః
పరమార్థ సాధకముశుభ, భరితంబగుసూక్తి నిట్లు, పలికెఁ సభలోఁ. ౧౯౫

ఉ. నాటిరికీర్తి సస్యముల, నారతమున్ జగదంత రంబులన్
మీటిరి శత్రుకోటులన, మేయభుజాబల వైభవంబునన్
దాటిరి దుర్భవాంబుధులు, చారతరవ్రత చర్యలన్ నిరా
ఘాటత మత్పురాతనుల, ఖండర మారమ ణీయభోగులై. ౧౯౬

క. అమ్మహనీయు లరుణతతి, జిమ్మిమ దార్జితములైన, స్థిరరాజ్యశ్రీ
లిమ్ముగఁ బాలింపనిదా, నమ్మగు సంతానమెట్లు, నాకయ్యెడునో. ౧౯౭

గీ. అనివచించు మహారాజు, నాదరించి, విబుధ వర్యులు వలికిరు, క్ష్మాశచంద్ర!
నీదుధర్మైక తానతా, నియతికాత్మ, నలరితిమి చింత యింకేటి, కవధరింపు.

క. సమవాప్త సర్వకాముఁడ, వమలినసర సాంతరంగి, వవనీశ్వర! నీ
సుమ నస్కృతఁ గంటిమిమి, టిమివాంఛిత మద్భుతఁపుఁ గడింపఁగఁ దోఁచెన్.

చ. ఇహపర సాధకంబగుమ, సీషజనించి నచించు నీవచో
మహిమము మెచ్చవచ్చె బుధ, మాన్యతఁ గంటివి భూమినాథ య
న్వహముఁ బరోపకార పరి, ణాహివి యన్నిట మేలు భావనా
విహితముగాఁగ దత్తవిధి, వేడ్కనో నర్పుము నేర్పుచేర్పునన్. ౨౦౦

క. ఔరససిద్ధి బొసంగమి, చోరస మతంబుదత్త, సూనుగ్రహణం
బోరాజల లామమ! ది, వ్యారూఢిన్ జ్ఞాతిసుతుని, నందికఁగొనుమీ. ౨౦౧

క. ఇదివేద పురాణాగమ, విదితంబని నిశ్చయించి, విబుధులు వల్కన్
ముదమంది రాజపుంగవుఁ, డుదితోత్సాహుండు దెచ్చె, నొక రాట్తనయున్.

ఉ. ప్రప్రపితామహుండయిన, పార్థివనందనుఁ డద్వితీయుఁడై
యప్రతిమాన తేజుఁడగు, నట్టిధరాధిపు రాఘవేశ్వరున్,
దీప్రపితృణవార్ధిఁ గడ, తేర్చినయా పెద పద్మనాభధా
త్రీప్రభు గర్భరత్నమయి, తేజరిలెన్ నృప లోకరత్నమై. ౨౦౩

క. ఆరాజ కుమారుఁడు రే, ఖారాజక మానుఁడగుచు, ఘనరాజ్యశ్రీ
లాహూషత నార్జించియు, దాంతత నాగన్న గారనాఁ జెలువొందెన్. ౨౦౪

ఉ. ఆనసుధా సుధాంశునకు, నంగన మైతగు పార్వ తమ్మపుం
భావత నాత్రిశక్తులిలపై జనియించి రసంగ నొప్పగో

ద్రావరులన్ గుణోత్తరుల, రామధరావిభు, జగ్గభూపతిన్,
బావను వేంకటాద్రియను, పార్థివుఁ గాంచెను ముర్వురన్ వెసన్. ౧౦౫
క. ఆరాజ త్రితయములో, జారుతరోత్సాహి జగ్గ, జనపతి ననసీ
శౌరిచినరామలింగమ, హీరమణుఁడు పెంచుకొనియె, నెల్లరుమెచ్చన్. ౧౦౬
శా. రంగాం బాచిన రామలింగ మహిరా, డ్రత్నంబు లార్యాశివుల్
గంగానందను చేముదంబలరు రే, ఖన్ జగ్గ ధాత్రీవిభున్
శృంగారప్రథ మవతారసుతుఁగాఁ, జేకొంచు నప్పొంగియు
త్తుంగ శ్రీలలితాష్టభూతి విభవో, ద్వ్యక్తిన్ విజృంభింపఁగన్. ౧౦౭
గీ. అలజగన్నాథ నృపతిభు, జాగ్ర జాగ్ర, దుగ్రకరవాల ధారావి, యోజి తారి
మండలేశ పరంపరా, మకుటరత్న, నిచితధాత్రీత లుండౌచు, నేలనేలె.
సీ. కదసి పంజులనుల, గ్గలకెగ్గఁబురికొల్పి, కోయంచురాదీసెఁ, గొండవీఁడు,
వెనుక కాలిడకచి, వ్వనఁజువ్వగుంపుల, వెట్టఁజూపిగణించె, విన్నకొండ,
కలియు గార్జునుఁడంచు, గలఁగినైరులువార, బెదరించిచేపట్టె, బిలముకొండ.
గండర గండఁడై, కదిసి మీసముదువ్వి, కొంగుముల్లెగఁ దెచ్చెఁ, గొండపల్లి
గీ. మఱియుమేదరసాలము,మ్మరమురాయ, దుర్గఁపుగడిందిచిహ్నము,ల్దూలపుచ్చి
కొనియె దుర్గాధిపత్యంబు, కుతలపతులు, మెచ్చ జగ్గక్షితీశుఁడ, మేయశక్తి.
గీ. కమ్మవిలుకానిరాణిచ, క్కందనమ్ము,గమ్మపడసేయునందమ్ము, గమ్మరనఁగఁ
గొమ్మలకు నెమ్మనై యిటు, గ్రమ్మరిలఁగ, నమ్మహీజాని జాయయ, చ్చ
మ్మతనరె. ౧౧౧
ఉ. బాలర సాలసంతతిని, భాసిలఁ గాఁగల కంఠకాకలీ
లీలలెసంగ గాసుమశి, లీముఖ మాధవ యుక్తి మించఁగా
భూలల నాల లామమగు, పుణ్య సతీమణి యచ్చ మాంబ శో
భాలలితాగ మోపవని నాఫల దాయిని యయ్యె నెల్లెడన్. ౧౧౨
శా. ఆరాజన్యున ఘనాపతం సముచిత, వ్యాహార నిత్యామృతా
హారస్వైర విహార భీతిపరిహా, రాసార ముక్తామణీ
హారప్రాగ్రహ రాగ్రహారమణిభూ, షాదిన్ నిజాఘాఘసం
హారం భూష్పఁగ నాథుతోఁ గలిసిని, ప్రాలిన్ భజించున్ గడున్. ౧౧౩

సీ. రాజ్య వైభవమున్న, రాజ్యప్రథమునకో, నేకాంత భక్తిమై, యేలి యేలి
భాస మానము హొందఁ, భాస మానప్రౌఢి, దెసలు సత్కీర్తి సా, ధించి మించి
భోగ భాజనకళా, భోగభాజనముగా, ప్రాభవం బఖిల మెల్ల, జఱపి నెఱపి
నతిరం జనకృతా, నీతి భంజనశక్తి, జనము లాలించి పే, ల్పలిపి నిలిపి
గీ. ధర్మపత్నీస మేతస, త్కర్మమర్మ, కర్మఠుండయి ధరనైహి, కమ్ము దనకు
సొమ్ముగామీఁద నాముష్మి, కమ్ము గూర్చు, తరుల గొమరు రుంకు లేని, చింతల
మానిఁగి. ౨౧౪

చ. హరిహర సేవనానిరతి, సంతనిరంతర భక్తివాసనా
కరములు పుత్త్రికామలతికా, పరిపోషణ సుప్రసక్రియా
కరములు నిష్ఠమై బుధస, దాశ్రిత కర్మము లాచరించుచుం
దరుణియు దానుధర్మగుణ, తత్పరతం దపియించు చున్నెడన్. ౨౧౫

శా. ప్రాణాపాన సమీకృతి స్ఫుటితకం, దాంభోజ మాక్వీసుధా
పానోన్మాద మెలర్చి మేనుపొగ, యుంపంబొక్క నాలోన బ్ర
హ్మానంద ద్రుమ కోరకంబుననతే, జోంకూర మాత్మాంగనా
ధీనంబై జఠరంబు సొచ్చినటులం, దీపింప జేడమ్యెసన్. ౨౧౬

గీ. తనమనో రథసిద్ధిసూ, చనమభీష్ట, దేవతాకర్త్ర కంబని, తెలిసి విబుధ
సంవి ధానంబు గానాత్మ, సతికిఁ జెప్పి, నిరతి శయ మోది యగుచున్న, న్నిశ్చ
యమున. ౨౧౭

సీ. రేణుకా గర్భమ్ము, రాణింప నుదయించి, జమదగ్ని నలరించు, జక్రధరుఁడు
కోసల కన్యకా, కుక్షి వెల్పడివచ్చి, దశరథేశునిఁ దేర్చు, ధరధరుండు
దేవకీ జఠరసం, దీప్తుఁడై ప్రభవించి, వసుదేవు నెసగించు, వార్ధిశాయి
జలజాక్షి యచ్చమ్మ, జఠరమ్మునజనించి, జగ్గభూపతి సంత, సమునఁ దార్ప
గీ. వెలసె నోయనఁ జెలువొందె, విభవవితర, ణప్రభావ ప్రభుత్వాదీ, ప్రప్రతాప
ధీర తాముఖ సద్గుణో, ద్దీప్తమూర్తి, వేంకటాద్రి మహాన్నత్య, వేంకటాద్రి.

గీ. కృతయుగాదియుగత్రయీ, కృతనిజావ తారములమూటవన్నత్రి, తయముఁ దేర్చి
నాల్గవ యుగంబు వెలయించు, నాగశౌరి శూద్ర కులమున దా వేంక, టాద్రి
యనిరి. ౨౧౮

ఉ. నిరతిశయ ప్రభావ మహా, నియత ధర్మ గుణాను వర్తనై
ధర వెలయించి తండ్రినిజ, దైవతశమ్మున సార్వలోకరా
జ్యరమకు వల్లభుండగుచు, నంతసపత్ని జయాభిలాషచే
నరిగెన నాగఁడల్లియన, లార్చుల ద్రుగ్గగ సర్పకున్వెసన్. ౧౨౦

సీ. దాన దీక్షాసంధి, ధానాధు నాతస, మాంధాత యనవోష్ణ, మహిత రుండు
త్రిభువన సువిదితకీ, ర్తిప్రతాపద్వయీ, పుష్పవద్విత్వాను, భూష్యభువని
జనరంజ నప్రభా, చాళుక్య రఘు రామ, పరిపాల నోన్నిద్ర, భద్ర మూర్తి
శమద మానుష్ఠాన, సామరస్య క్రియా, జనక ధర్మోత్సాహ, జనక విభుఁడు
గీ. నగుపితృకృత్యాడు రామగో, త్రాధినేత, లాలన మొనర్చి ప్రోవఁడ, ప్రమణీయమైన
జానకీదేవియట్లపో. షణమొనర్చ, నర్కుమారుండు వర్ధిల్లె, నంతనంత. ౧౨౧

మ. జనక జ్యేష్ఠ కనిష్ఠులైన నృపతి, స్వారాజు లారామనా
మనరాననేసుఁడు వేంకటాద్రి విభుఁడు, న్మన్నింపఁ దక్షూనులో
య్యాన నాగన్నయుఁ జాద్రమౌళియును దోషైయాఁడు చోఁబాడుచో
జనర్పుంజాపఁగ వేంకటాద్రి కొమరుం, జాదంబుఁ జూపెన్వెసన్. ౧౨౨

గీ. ఈశ్వరోల్లాసమటులుండ, నిమ్మ థాసు, ణీశ్వరత్వంపుఁ బేర్మిన, నృపసుతుండు
నాఁడునాఁటికి శైశవక్రీడలందె, యద్భుతారంభశక్తిభా, వ్యతఁదనర్చె. ౧౨౩

సీ. చతురాననుఁడువచ, స్సామరస్యములందు, సర్వజ్ఞుఁడార్యాను, షంగములను
బురుషోత్తముఁడుధరా, భరణ ధూర్వహమున, జిష్ణుండు విబుధన, ర్ధిష్ణు కళల
శాస్త్రాతుఁడుసహస్ర, పత్రార్జనములచేఁ జైవాతృకుఁడుదక్షః, క్షణనములను
శుచిసర్వ ధారాజ్య, సుఖద భోగములచే, రాజరాజిష్టార్థ, రంజనముల
గీ. రహింనంతప దాధికా, రమ్మునలుగ, దివ్యతేజస్స ముల్లాస, దృఢశతయురుడె
యునఁగనగరాజ ధైర్యసా, హసవిలాసి, వెలసెభూదేవభాగ్యమై, వేంకటాద్రి.

సీ. ధర్మకాండాభ్యాస, తత్పరత్వమెకాదు, ధర్మకాండాభ్యాస, దక్షుఁడయ్యె
మంత్రాంగ కలనాపి, మర్శనంబేకాదు, మంత్రాంగ కలనాభి, మానియయ్యె
రాజశేఖరభావ, రక్తిఁగొల్పుటెకాదు, రాజశేఖరభావ, రసికుఁడయ్యె
పరమార్థసంగ్రహ, ప్రౌఢిఁగాంచుటెకాదు, పరమార్థసంగ్రహ, ప్రబలుఁడయ్యె
గీ. శైశవమునాఁటఁ గోలెరా, జన్యతనయుఁ డైహికాముత్రికక్రియా, భ్యాసవిధుల
బుధుల ఘనములఁ గరగించు, పొలుపుఁ జెలుపు, నని తరప్రతి మానసా,ను
న్నమానసం. ౧౨౪

క. ఆవేంకటాద్రి నృపతిధ, రావలయంబేలె నైరి, రాజన్యమనో
భావలతా భావలతా, కేవల తాధుర్య కార్య, కృతచర్యాఢ్యై. ౧౨౯
సీ. మెచ్చు లిచ్చుటె కాదు, మేటి శ్రీ మంతుల, కప్పులిచ్చిరి నిచ్చ, లర్థి జనులు
పాఱిపోవుటె కాదు, పటువింధ్య గుహలలో, దూకిడాగిరి సర్వ, దుష్ట రిపులు
కలిమి మించుటెకాదు, కడిదిరా గరువంపు, బలిమిమించిరియెల్ల, పరిజనములు
రాగమందుటె కాదు, శమణుల తోనిద్ర, భోగంబు లందిరి, భూమి ప్రజలు
గీ. రాజ రాజాధి రాజవీ, ర ప్రతాప, రాజ మార్తాండ బిరుదాభి, రాముడైన
వేంకటాద్రీంద్రుడిలనిరా, టంకవిజయ, సాహసాంకతనేలునా, సమయములను.
సీ. అష్టదుర్గానటీ, హంవీరరతి రాజు, సాళీలిగజఘటా, చక్రవర్తి
రాజాధి రాజవీ, ర ప్రతాప ఘనుండు, గడిదుర్గ గండర, గండ బిరుదు
రమ్య చాళుక్యనా, రాయణ రాణ్మౌళి, క్రౌంచ పట్టణపుర, గ్గాంధకర్త
జన్నికట్టడిగుత్త జట్టిమల్లుండురెడ్డి, కర్నాట నృపరమా, కాముకుండు
గీ. వాసిరెడ్డి కులాబ్ధిజై, వాత్రుకుండు, వేంకటాద్రీందుడతికృపా, స్వష్టి మెఱప
సిరుల నలరారి బ్రాహ్మణ, శ్రేష్ఠులెల్ల, తన్మతలము యాపనిరవ, శేష ము
సీసమాలిక.
గంగానిరి. ౧౩౦
దశపురీనిర్మాణ, ధౌరంధ రీశాలి, శతముఖి పుణ్యసా, తొగ్గుభిహుండు,
ప్రాజ్ఞసాత్కృతశత, గ్రామాగ్ర హారుండు, శతసువర్ణస్తంభ, శాసనుండు
చాముండికామరే శ్వరహర్మ్యగోపుర, ప్రాకారకల్పనా, ప్రథమకర్త
గోదానచాళుక్య, గుణఘూర్ణి తయయాత్రి, బహుసప్త సంతాన, పారగుండు
అవిముక్త సేతుయా, త్రానందసుఖభోక్త, భగవతీపూజనా, భరితయశుడు
సంగీతసాహిత్య, సరసవిద్యాభోజు, డద్వైత భావనా, భవ్యహృశాంతి
లలిత సాలగ్రామ, లక్షదానవిధాని, కోట్యన్నదాతృతా, కుశలఘనుడు
హేమాద్రి దానైక, హేలావిలోలుండు, సిద్ధపంచాక్షరీ, సిద్ధధనుడు
సాంగ హిరణ్యగ, ర్భాఖ్యగ ప్రవ ణుండు, ద్విజభుక్త శేషభు, క్తి ప్రవతుండు
గీ. వీరశంకర బసవహం, వీరమన్నె, రాయసుల్తాను బిరుదవి, రాజమానుం
డగుచు శ్రీవేంకటాద్రి ధరాధినేత, కవిమరవగావసుగు, ణాభి గణ్యుడయ్యె.
క. అవ్వాసు భావర మణికిణ, జవ్వని వెల్లమ్మదాస, సమయములందుర
గవ్వాగజా బంగరుమల, యవ్వని తామ్మశివి నెన్న, నగుమగు వలకా. ౧౩౧

సీ. విభునికౌఁగిళ్లలోఁ, జేల్పుటల్తిరిమిన్న, తటినర్థ తతి కెల్లఁ దల్లితల్లి
సరస వాగ్రచనఁద, చ్చనలాఁడ నుడిలేమ, స్వైర వర్తనలన, చ్చెముగ [illegible]
యిష్టాన్న మిడఁగవి, శ్వేశ్వరు నిల్లాలు, రమణసద్భక్తిశ్రీ, రామరామ
ధర్మనిష్ఠామహిషి, దశర థేశ్వరురాణి, శత్రుసాదనశక్తి, సత్యభామ
గీ. యనుచునునిచినగౌరవ, వ్యాప్తినాప్తి, సుజనులభినుతిసల్పమె, చ్చులఁడ [illegible]
చేవకులమలయాద్రికి, శ్రీప్రసూనబో, యనెడి పాపయ్య పట్టిసె, త్రైమ్మ [illegible]
సీ. ఏకదేహానోన్యన్య, హితవర్తనంబున, శాంకరీ శంకర, చ్ఛాయనలరి
రమ్యసౌహార్దవి, భ్రమవిలాసవ్యాప్తి, శ్రీశ్రీయః పతులమ్మ, ప్రకలఁదేరి
పలుకులో నిఁడుఁ దప్పఁగ నీమిభారతి, భారతీశ్వరులమ, వ్వమునఁ [illegible]
అమర భోగోల్లాస, మతిశయింపదిశచిశ, చీశసర్వార్థము, హిమ్మతిఁగని
గీ. ప్రబలె విబుధాభి వంద్యమై, బహుసహస్ర, దంపతీపూజనాయత్త, [illegible]
మగుచునద్ధంపతీరత్న, మనసయందు, నెలమినెల్లమ్మ వెంకటా, ప్రీమ [illegible]
క. ఉత్తమశ్రీసిరిలో హరివలె, బిత్తరి నెల్లమ్మకొండఁ, బృథివిప తిలకుఁ
జొత్తిలియుఁ బిత్వాబ్జాంబుధి నెత్తిగల బడ కయునికి, కోర్చెనంతటఁ [illegible]
చ. ఎలమి పయోనతాదుల సమీహిత వర్తన నాత్మ జాప్తికై
సలిపియు నీప్సితంబుఁ గనఁ జాలమి మత్తచ కోరనేత్రసే
చ్చెలిఁదమి నీరుకొండ నరసింహ ధరావరు పుత్త్రిసార్వలి
జలజగళి వివాహమును సల్పెను దంచిత కంతు సంపదల్.
సీ. తనపుట్టి నిలుచిరు, తనమని యన్నిరు కొండ క్రొత్తగనిరు, కొండగా [illegible]
దొలుగ వానరసింహ, పూర్వపుండు తం్రిసరసింహమూర్తియైనలు [illegible]
సర్వాంగసౌందర్య, సరసతిమునుజేమి సహజ పూర్ణాంగాభి, షంగ [illegible]
దనచండికాన్నలి, దాఁచి సర్వజనాను, రాగంబు మదిలోన, రహిం [illegible]
గీ. ధరణితలమున నపకాన, తారమును పార్వతీదేవి నా బుధ, ప్రతతి [illegible]
బరమ పావను డైనయు, ప్పార్వతమ్మ రాజశేఖర కాంతయై, రక్తిఁ [illegible]
క. అప్పార్వతమ్మ, శ్రీపతి యప్పాలలోఁబు, ట్రపెట్టెఁగ నంచనలా నె
ల్లప్పాకు ద్విజ పుంగవులకు నప్పులు దీర్చునటులర్థ, మర్పించఁ గదా [illegible]
మ. ధన ధాన్యంబుల సర్వ సంపదలహా, తల్యాంబ ఖాండంబనా
కనియుం జాలక కామధేనువు దివి, [illegible] నాయంబులే

దపదించెర్ బెడఁ బాపె భూమికిమహా, ధర్మాత్మయై పార్వత
మ్మన వాఙ్లాసమునన్ బుధావళికి ని, పమ్మోసంప దల్లూచుచున్. ౧౩౮
శా. నేర్చున్ వల్లభు చిత్తవృత్తి తనపై, నిండారఁ గానిల్పఁగాఁ
గూర్చున్ సద్వ్రత నిష్ఠలన్ సుకృతముల్, గుప్పల్వడం జిత్తముల్
గార్చున్ బ్రాహ్మణ కోటులన్ మనములో, ధర్మైకనిష్ఠారతిన్
జేర్చుం బావని పార్వతమ్మ గుణముల్, స్త్రీమాత్ర సాధ్యంబులే. ౧౩౯
సీ. ఆరఁగాగినపట్టు, టావుల దుగ్ధముల్, తస్వాదీరఁగ నెందుఁ, ద్రావలేదె
వ్రీలఁ బాడిన చింత, నింత మామిడి పండ్లు, నోరూరఁ గామెక్కు, వారలేరె
తెల్లజేనియపాల, తిమ్మనంబులు గ్రోలి, తెఱపిరియించుక లేక, త్రేవ్వలేదె
మీగడల్ చక్కెరల్, మెదపి నంచీకుండ, భుజియించి విపనుతై, పొరల లేదె
గీ. యన్ని యటులుండ నిమ్మహా, తెన్నఁ దరమె, భాగ్య వతియైన యట్టియ, సాపర్వతమ్మ
యన్నసత్రంపుఁ డానంద, మునవిసిరుల, కమృతసేవనమయ్యె నో, మనఁగఁ గలఁడు.
గీ. సాప్తపూరుష మైనిడఁ జాల కున్న, యర్థి దారిద్ర్య, మణ పఱలయ్యె ననఁగఁ
బార్వతమ్మసునీతపః ఫలముగాదె, దానలక్ష్మీకినపరావ, తారహార. ౧౪౧
మ. తరుణీరత్నము పార్వతమ్మ పతిచి, త్తంబాత్మ విత్తంబుగా
నిరతంబాత్తను భోపభోగముల ని, ర్నిద్రస్థితిం గాంచి సా
దరవృత్తిన్ ద్విజదేవ తార్చనలని, త్యప్రీతి రాశించుచున్
ధగనాత్మేశ్వరు నింద్రుతీయ పురుషా, ర్థశ్రీ రహిం దేల్పఁగన్. ౧౪౨
చ. అధిగత సర్వకాముఁడను, సజ్జన పాలల లామ మన్వథూ
నిధునవ భోగసంపదభి, నిస్తుల రాగరసాబ్ధి నీడియున్
పృథునిర పత్యతాంబునిధి, నీదగ లేమిఁదలంచి ప్రాజ్ఞలి
న్విఘము వచించి రంచితన. వీనవిధిప్రసన ణంబుగా రహిన్. ౧౪౩
క. మానుడి మానసి కవ్యథ, మానుఁడి వినఁ దౌరసాను, మానమ్మనన
న్మానమ్మున దత్రిమసం, ధానమ్మ యను ధార్థవిధివి, ధాన మ్మనియున్. ౧౪౪
మ. విబుధోక్షీత వాక్సుధాంబుధి మహా, వీచీవ గాహంబునన్
సాబగై హాయిఁ జెలంగు మానసమునన్, సొంపుల్ దువాళింప న
వ్విబుధా ధీశ్వర వైథప్రుడమునవ్వ, ధ్వజాని నల్కొన్నుడిన్
నిశ్చితార్థంబుగఁ బంకిత ప్రజముల్లో, నిష్ఠాగరీయస్యంబుగన్. ౧౪౫

శా. పుత్రస్వీకరణార్థబోధనలసం, బూర్ణంబుగా శాస్త్రముల్
శ్రోత్రార్హంబుగ నానతీవలయునం, చుర్వి న్వినం బొంగ స
ద్గోత్రాధీశుని తో బుధోత్తములసం, కోచస్థితిం బల్కి రా
మ్నాయార్థావహ దత్తసంగ్రహణసం, బోధంబు లావాక్యముల్. ౧౪౬
శా. విజ్ఞానేశ్వర కాలమాధవముఖా, విఖ్యాత ధర్మావళీ
విజ్ఞేయార్థము లేర్పరించి విబుధుల్, వేర్వేఱ భాషింప ధ
ర్మజ్ఞానాంఘమతప్ర భేదములను, ర్మంబెల్ల శోధించి త
త్వజ్ఞానా నుభవంబుఁ జెందిపతి దత్తస్వీకృతిన్ లోలుఁడై. ౧౪౭
క. ఆయుర్భాగ్యములునిజో, పాయంబుల జీవకోటి, పాల్పడునెయదృ
ష్టాయత్తంబులు దెలి యఁగ, నేఁటునువునఁ గామితెల్ల, మిదియర యింగీ.
క. ఏష్టవ్యా బహవోయని, శిష్టోక్తుల జనకవాంఛ, జెప్పెనిది మహా
త్కృష్టగతియాగసార్థము, స్పష్టముగాదయ్యెదత్తు, సంగ్రహణములన్. ౧౪౮
క. భారత భాగవతాధిక, పౌరాణిక గాథలనుడ, పస్వీకు లేగ్రహల్
కూరిమి బహుదత్తస్వీ, కారనుగా వించునట్లు, గావిందు మొగిన్. ౧౪౯
క. అనియాలోచించి మహా, వినయోజ్జృంభిత వచఃప్ర, వేశంబులన
మ్మనుజప తిసుధాంబుధిను, జ్ఞనమునబలెబుధులదేర్చి, జనితోత్సవుడై. ౧౫౦
మ. జనక జ్యేష్ఠక నిష్ఠులోయనఁగవి, జ్ఞానంబునన్ ధన్యులౌ
జనకజ్యేష్ఠ కనిష్ఠు లర్థిజనర, ఖౌదక్షిణుల్ రామనా
మనరాధీశుఁడు, వేంకటాద్రి యనునా, మాఖ్యుల్ తదీశద్వయీ
తనయోద్భూతుల రాకుమారులగొనెన్, దత్తాత్మ జఖ్యాతులన్. ౧౫౧
క. అన్నంద నయుగళమునజ, గన్నాథ నృపాలుఁడగ్ర, గణ్యాంత్రైయా
పన్నుల పెన్నిధియైనగ, భిన్నభవిభవాసుభూతి, పృథుయశుఁడయ్యెన్. ౧౫౨
ఉ. రెండవ నందనుండు, శుభ రేఖజయుంతవ సంతకంతులీ
రెండవరూపు లూనిరొకొ, రేదార రాత్రిజరించు నొక్కానా
నిండుటొ యూరకుల్ సహాయలు, నీటులు దేటలు, వారబొప్పెభూ
మండలి రామనాథనృప, మాన్య, జగన్నుత శక్తికేతమై. ౧౫౩
సీ. సమర సాహసధనం జయుడింతి యేగాడు, చటులవిక్రమధనం, జయుడితండు
కరుణాసరిస్వామీ, కామినీమోహనాను, ఘనదీసరస్వామీ, కామినీలేఁడు

చాతురీవిబుధరం, జనుఁడింతియె కాఁడు, సద్భక్తి విబుధరం, జనుఁడితండు
ధర్మరక్షణకళా, ధాముఁ డింతియె కాఁడు, దానధారాకళా, ధాముఁ డితఁడు
గీ. రాజపుత్రుండె కీర్తిని, రాజతాప్త, దిగ్గమాపూర్ణ సామ్రాజ్య, దీప్తిశాలి
రామనాథావనీరాజ, రాజు రాజ, రాజధనవైభవోద్దామ, రమ్యకేళి. ౧౬౪
వ. అక్కుమారుం దద్వయంబునందు. ౧౬౫
ఆ. అగ్రగణ్యుఁడైన, యుద్ధిజున్నాథుఁ, డతులగుణకదంబ, సచ్చమాంబ
నర్థికామధేను, వగుచంగ మాంబను, పరిణయంబునొందె, బ్రభుత మెఱయ.
క. శ్రీలలర రామనాథ నృ, పాలుఁడు శ్రీలలనకుఁ బగిది నెనయుచుఁ
లాలించె వేంకమాంబిక, నాలలనం బాపమాంబ, నాపూజ్యోఢిన్. ౧౬౭
క. ఆరామనాథనృపతికి, ఘోరారి నుతప్రభేద, తుకలాకృతికిన్
ధీరాత్మజులు సుతుఁడిద్దఱు, నారక ఉద్భవంబు, వర్ణింతుఁ గగర్. ౧౬౮
సీ. ఏరాజు బాహాసి, ధారాభిసారంబు, పాతంబు వైరిరా, జ్యార్గమునకు
నేభాగ్య శుభకీర్తి, శోభావిహారంబు, హారంబు దిక్సతీ, వారమునకు
నేనాథు ప్రస్థాన, సేనాసుశబ్దంబు, శబ్దంబు సత్పథ, సరణి కెపుడు
నేమహాత్ము సత్కృపా, భూమహిసానంబు, పానంబు బ్రాహ్మణ, సంఘమునకు
గీ. ననుచుఁ గొనియాడుదురు మాళ, వాంగ వంగ, పాండ్య నేపాళ మగధ ఘూ, పాలసభల
వాసిరెడ్డికులాంబుధి, వనజవైరి, దాశరథినాయనామనృ, ధ్యేశవరుని. ౧౬౯
క. ఆతఁడ్వె విభుని తమ్ముఁడు, చేతోజాతాభిభక్తి, శీలుఁడు సుగుణ
వ్రాతాభినుతుఁడు వినుతిస, నాతనుఁడు శివప్రసాద, నాయకుఁడలఁపన్.
క. కన్నుల విలుగల బలియుని, కన్నంగన్నాకు చెలువు, గన్నకొమరులన్
గన్నకుమారుల బరిఁడిన, కన్నులగని తండ్రిమించి, కన్నంబోడనై. ౧౭౦
సీ. ప్రథితవిజ్ఞానాంబు, నిధులతో బుధులతోఁ గవిలోక రవులతోఁ గవులతోఁడ
బహుపరాక్రమమహా, నటులతో భటులతో, బహుళార్థబలముతో, జలముతోఁడ
ధర్మప్రధానసా, ధనముతో ధనముతో, శ్రితపురోహితులతో, హితులతోఁడ
భరితనీవృత్పరం, పరలతో దొరలతో, మాత్రిశ్రీ మణులతో, మణులతోఁడ
గీ. నైహికాముష్మికోత్సవా, భ్యహితమైన, నందనులునిచ్ఛలభినవా, నంద మొసఁగఁ
వేంకటాద్రి క్షితీశు ని, త్యవిభవ, మభినుతింపంగ నెసఁగె దుర్లభస మ్మానిధి

ఉ. అయ్యెడ వేంకటాద్రిపను, ధాత్రిపుఁడర్మిలి నర్థిసాళికా
దాయ్యనదేవ సృష్టిలయు, నొందినిజప్రతిష్ఠ ప్రభాపలక్
నెయ్యము దివ్యముగ గొలిపి, నిర్మల నైజసితాత పత్రసా
హాయ్యముగాగ రాజ్యసుఖ, లాంగిము, గూర్చెను పుత్రసౌఖ్యముల్. ౧౩౨

క. అంతజగన్నాథమహీ, కాంతుఁడు, సౌందర్యవిజిత, కంతుండగుచున్
సంతత సామ్రాజ్యధురా, క్రాంతవిభూతాదనర్చె, గరుణానిధియై. ౧౩౩

ఉ. బంధురులుగ్ర ప్రధానులును, బాడిమెరుంగు గవుంబ పురోహితుల్
బంధురసింధు రాశ్వరథ, పఙ్క్తులు భ్రాజ్యసమృద్ధి సంపదల్
గంధిలకీర్తిఁ దన్నలము, గాధరణిం గొని రాయనాథరా
ట్సింధుర నైరియేలెనువి, శిష్టజనాళిక భీష్టవైఖరిన్. ౧౩౪

సీ. నలహరిశ్చంద్రాది, నయమంప్రతిష్ఠించె, నిది మొదలౌ కాలంబు, కృతయుగంబొ
జనకరాఘవముఖ్య, స్వర్యచర్యలనునించె, త్రేతాయుగస్ఫూర్తి, దివిరికొక్కొ
భరతయుధిష్ఠిర, ప్రభృతి వృత్తము లెచ్చె, ద్వాపరం బభిభూతి, దనరెనొ
కొ
వరపరీక్షిన్ముఖ్య, వర్తనంబులు మీరె, గలికాల వృత్యముల్, గట్టున ఁడెనొ

గీ. యనుచు సాదృశ్యమున బుధు, లట్లయనఁగ, సత్యసద్ధర్మ మహిమల, సా
టిచెప్ప
బూర్వరాజులె యనఁగన, పూర్వవిభవ, సాంద్రుఁడై యొప్పె వేంకటా, ద్రీం
ద్రవిభుఁడు. ౧౩౫

క. ఇత్తెఱఁగున మత్కులితా, విత్తమున బరిష్కరించి, విభుచే మాకున్
గ్రొత్త లగువృత్తు లొసఁగు మహాత్మరుఁ డక్కాలి దాసు, నభినుతి దరమే.

వ. ఇత్తెఱంగున ననితరాధిక సంపద్యశోవిజయ విభవాభివృద్ధులై, వంశం బభివర్ణ్యంబై, ప్రవర్తిల్లుచున్నయది. ౧౩౬

సీ. వెండితో సురరాజు, తుండితో మగరాల బాడితో నెలరాల, పిడితోఁడ
భద్మమ్ముతో సింహాసి, భద్మమ్ముతో నమృతకుంభమ్ముతో రసవిజ్ఞు, భద్మమ్ముతోఁడ
పాలతో నాణెము, త్యాలతోఁ దెలికప్ప, రాలతో బొమ్మతే, జీలతోఁడ.

గీ. సాటిసత్కీర్తి సాధించె, నేటిమితని, తోటిసరిగల రేమంత్రి, కోటిగోన
ననఁగజెలువొందె ప్రొత్తూరి, యన్వయమున రాజనయతంత్రికుశలవ, రామ
మంత్రి. ౧౩౭

సీ. పలుకనేర్వరియుంచు, బొంకుటింతియెకాని, కలనైననస్మృతంబు, బలుకనేరం
దోర్చనేర్వరియుంచు, సూహించుటేకాని, యొరులపేదరికంబు, లోర్చలేడు
యియ్యనేర్వరియుంచు, నెంచుటింతియెకాని, యెంతవారికినునం, బియ్యలేదు
పెట్టనేర్వరియుంచు, పెద్దలందురుగాని, ప్రియసూక్తి పెడచెవి, బెట్టలేదు
గీ. సత్యవితరణ గాంభీర్య, సరసతలకు, మేటులగువారి లోపల, మేలుబంతి
ఘనుండు పొత్తూరి వంశపావనుడ సుమ్మి, రాజనయతంత్రి కుశలవ, రామ
మంత్రి. ౧౧౯

సీ. ఆర్యానమగ చాతుర్య మెంతసదెల్పి, దనరాజభూషణ, త్వంబెదెలుప
క్రతుభుగర్థ హిరణ్య, కశిపువర్ధన వృత్తి, దననరసింహావ, ర్తనమెదెలుప
లక్ష్మీకరాంతర్వి. లాసవిస్ఫూర్తులు, దనయసమాయుధ, త్వంబెదెలుప
పటుసుధర్మాస్థాన, పాలనాభిశయమ్మునదనవిబుధాధిప, త్వంబుదెలుప
గీ. శార్వగర్వా సనావకృచతురవిక్ర మాతపాక్రాంత పరకును, దాశిహేళి
గాక యొరుండౌనె యసమించె, నేకహేళి, రాజనయతంత్రి గుశలవ, రామ
మంత్రి. ౧౨౦

సీ. మలయధ్వజుండైన, మహిపతి యింటిలో, సుందరేశ్వర మూర్తి, సొంపెలర్ప
మీనాక్షితో నిల్పి, మెలంగు నట్లేకాకు, లాబ్ధిచంద్రుండైన, యట్టిఘనుండు
పుండరీకాక్షుడర్క, పురుషుండు జామాత యిల్లాలిగ్గూడి, యింటహితము
జక్కదీర్పంచాను, సమవాప్తకాముడై యిగ్రదవైభముతో, నెనసియుపని.
గీ. మంత్రి మార్తాండుండై జగన్మహితవృత్తి, సాటివారలు మెచ్చును, త్సాహ
మొందు
రాజనయతంత్రికుశలవ, రామమంత్రి, సన్నుతింపంగదరమెవా, జ్ఞానికైన. ౧౨౧

సీ. ఆప్పండకీ కాక్షు డత్యాత సౌందర్య, లావణ్యసౌభాగ్య, లక్షణముల
నంబోధికన్యకా' సంభావితాకార, యగుచు జెన్నొందుజి, న్నమ్మయందుం
బుత్త్రిలగాంచెను, భూరిసత్కీర్తుల, సిద్ధురనందులో, పెద్దయైన
వేంకటవెంకయ్య, విమలచారిత్రుండు, పాత్రుండు సౌభాగ్య, పదవికెపుడు.
గీ. చిన్ని కొమరుండు సంతత, శ్రీవిలాస, సుభగుండై యొప్పు వేంకట, సుబ్బమంత్రి
వివిధగుణ శాలిసత్కాంతి, విభవహేళి, వారికొని యాండ దరమెయె, వ్వా
రికైన. ౧౨౨

చ. కుశలవ రామ మంత్రివరు, కోడిగ మేమన వచ్చెఁబండితుల్
దిశలను సంచరింతురని, త్రిప్పటఁబొందఁ గనీక నందఱన్
వశపడ సేయఁగోరి, గుణ, బద్ధులఁ జేసె గదా! బలారె! త
ద్వశులయిసంఖ్య గల్గియును, వత్తురు సంఖ్యకు మీఱివారలున్. ౧౨౩
చ. ఘనఘన సారసంకుమద, గంధిల చందన గంధతైలము
ర్దనముల లబ్ధవర్ణులయి, రంజిలుటన్ విబుధాళికిన్ సరే,
మునుపు కులాఖ రస్తుతుల, మూటను రూఢిని యట్టుకొటయం
చనిచతు రోక్తి పొత్తుకు, లాఘ్యుని సౌధములన్ జెలంగెడిన్. ౧౨౪

* షష్ఠ్యాంతములు. *

క. ఏవం విధగుణ నిధికిన్, భావాంతర్బద్ధ ధర్మ, పథసేవధికిన్
భావిత శరధి శరధికిన్, గేవలపర మార్గ తత్వ, కృత నిర వధికిన్. ౧౨౫
క. శ్రీమందిర నేత్రునకున్, గోమల గాత్రునకు సరస, గుణపాత్రునకున్
సీమాతిగ మిత్రునకు, ద్దామభు జానిర్జితారి, తతి జైత్రునకున్. ౧౨౬
క. ధీరునకుం గవిజనతా, ధారునకున్ యాచకాళి, దైన్యోపహతమ,
స్మేరునకుం జితచిత్తవి, హారునకున్ మదనసుంద, రాకారునకున్. ౧౨౭
క. గోగోభవ గంధర్వను, ణీగోప్రతి నాదనాత్రి, నిష్టాభునకున్,
గోగోవిధు శరవిధుశర, గోగోజయ జాతకీర్తి, గుణ జాలునకున్. ౧౨౮
క. చటుల పరాక్రమ కేలా, పటలప్లుష్టారి పసర, పటుగహ నునకున్
ఘటనా ఘటన సమర్థో, త్కట మంత్రాంగ ప్రభావ, ధన వహనున కున్.
క. కుశల వచోగీష్పతికిన్, బ్రశమితరిపు తతికి,ధర్మ, పథ సంగతికిన్
శశిధర పూజారతికిన్, గుశలవ రామాఖ్యమంత్రి, కుల సుర పతికిన్. ౧౩౦
వ. అభ్యుదయ సముద యోదయాభి వృద్ధి యగు నట్టిల, నా యొనర్పం బూని
న, సరస హృదయానురంజ నంబను, మహాప్రబంధంబునకుం, గథాప్రారం
భం బెవ్విధంబునన్ బ్రవర్తిల్లె నంటేని. ౧౩౧

* కథా ప్రారంభము. *

మ. మునులన్నైమిశ కాననంబునఁ జిదా, మోదాను సంధానసా
ధనవిజ్ఞాన సమేతు సూతుఁ గనిచే, తఃప్రీతి నిష్పార్వభో

ధన మాధుర్య కథాసుధల్గొనుచుఁద, త్తద్గోష్ఠులన్ గాలయా
పనములేసేయుచు నెన్నిటం దనివిదీ, ర్పన్ రామి సానందులై. ౧౮౨

చ. జలరుహ నేత్రనేత్ర యుగ, సంభవులన్ వరకన్యలన్ గుహుం
డెలమిఁ బరిగ్రహించుట, మ, హిష్ఠ జనమ్ములఁ గొంత వింటిమ
య్యలఘుఁడు వారిఁ జేకొనుట, యంతయు మాకిపుడాను పూర్విగాఁ
దెలుపుము నీకు సర్వమును, దెల్లము గాదె! జగత్త్రి యంబురన్. ౧౮౩

వ. అని సాకాంక్షుంబుగాఁ బారికాంక్షి జనంబులు తన్నుబరి వేష్టించి యడుగ
యు,బ్రహ్మం బద్వితీయం బనుటకు నిరవ కాశంబగు తేజో మూర్తియైన సు
బ్రహ్మణ్యేశు చరిత్రంబు ప్రకృత ప్రసంగ పాత్రంబగుటయుం బొంగి యవి
త జగదప్ర వృత్తకథా జాతుండగు సూతుం డమ్మహా మునులకున్ గుహు
డు లీలా భేదంబులఁ దద్విహారం బొనర్చుట సవి మర్శంబుగా విను పింపం
లంచి, యిట్లనియె. ౧౮౪

* శాంతి పురాభి వర్ణనము. *

సీ. శ్రీభారతీ సమా, శ్లేష దీక్షాసిద్ధి, కేపురంబు తిరంపుఁ, గాపురంబు
కమల సంభవమనః, కల్పనా శక్తికి, నేపురం బభిరామ, నూపురంబు
భువన సప్తద్వయా, ద్భుత మణి రాసుల, కేపురం బెడలేని, దాపురంబు
పురుషార్థ వితరణా, భోగయంత్రో ద్భూతి, కేపురం బన వద్య,భూపురంబు

గీ. రజితగిరిచెంత,వసుభూధ,రంబువొంత, మలఁచిరపరంజిచేఁగొంత,మణులఁగొం
ఆదిరసరాజ రాజ్యసిం, హాసనమ్ము, తనరు,నుత్తర దిశశాంతి యను పురంబు

గీ. ధరణిమూలాలవాలంబు,కరణిమెరయ,స్కందగిరి,దానినాళంపు, చందమొం
వేయుజేకుల తమ్మినా, వెలయునమృత, భోగసంధాయకంబైన, పుర వరంబు

క. అప్పురి కప్పర పసఁటుల, గుప్పున నుప్పతిలువలపు, కుదిరి కలసుమీ!
యిప్పడమిగ నవతియను, గొప్పగు నెలవయ్యెఁదర్క,గోష్ఠుల నెపురున్. ౧౮౬

ఉ. ఆపురిసౌధ వీధికల, యందునయారె! యొయారపు హొయల్
చూపుచు మందమందగతి, సొంపులు నింపుమి టారి కత్తెలన్
గోపుర భామినుల్ నిలువఁ, గ్రొమ్మెఱుఁగుల్ గుములంచు నెంచియా
పైపయిఁ దోఁచుట భ్రమని, పల్కుదు రొక్కొక సారి ముగ్ధలన్. ౧౮౭

సీ. భారతీ భార్గవీ, పౌలోమ లేవీటఁ, బేరురచ్చల కెక్కు పేరటాండ్రు
నిగమాగ మామ్నాయ, నిచయంబు లేవీట, నాటితీరిన సభా, స్తారకోటి
భైరవా ఘోరాధ్రి, పటుమంత్ర దేవత, లేవీటి కోటపై, కోవు రమఁలు

అరవింద సంభవుం, డహరహం బేవీట, నధ్యక్షుఁడయ్యెబ్ర, హ్మాసనమున
గీ. గరుడ గంధర్వ యక్షర,క్షస్సమూహా,దురవగాహ ప్రచండదో, ర్దండదుదార
పారిషదపాలితంబౌచు, పరిఘవిల్లు, నట్టిశాంతి పురంబుని, త్యానుభూతి. ౧౮౯
శా. వీణావేణు మృదంగ వాదములుప్పు, ద్వివ్యోమ మధ్యంబునన్
శ్రేణుల్ గట్టఁగ, దేవయోని గణముల్, జేజే సమర్పించుచున్
మాణిక్యా వరణాంత రాంతరములన్, మంజుక్ర మప్రౌఢిమన్
గాణిక్యమ్ము నటింపఁ జేతు రెపుడున్, స్కందాను కంపార్థులై. ౧౯౦
శా. బ్రహ్మాణ్యంబు చరాచరాత్మకమని, వైరంబు నిర్వ్యాజమున్
బ్రహ్మాదిస్తవ నీయ దివ్య మహిమ, భ్రాజిష్ణు వౌనాదిమ
బ్రహ్మ బీశ్వరుఁ డంగనా తిలకమా, బాగూఁడి యవ్వీటను
బ్రహ్మణ్యార్చితుఁ డైకృపావశతగా, ర్హాస్యంబు రంజించెడిన్. ౧౯౧
క. అన్నగరీఘన ఖురళీ, సన్నుత విద్యాశ్రమైక, సాహస గుణసం
పన్నగణ సుతులుజగములఁ, గ్రన్నన రక్షింపఁ ద్రుంపఁ, గలబలసహితుల్. ౧౯౨
సీ. బ్రహ్మాసు లకు నైనఁ, బాద చారమె కాని, వర వాహ నారోహ, గరిమ లేదు
అనిలాదు లకునైన, నంతఃపురద్వార, సంచార మిసుమంత, సాగిరాదు
రాజయోగుల కైనఁ, దేజోవ లోకనా, దులఁదద్ర హస్యంబు దోఁచఁ బడదు
సనకాదులకు నైన, సామర స్యానన్ద, సభలలో నిలువంగ, శక్తి లేదు
గీ. అచలశివశక్తి నిర్వికా, రానుషంగ, భోగ సామ్రాజ్య వైభవా, భోగపూర్ణ
నిరతిశయసంవిదు జ్జృంభ,నిష్ఠులైన, ప్రమథులకుమన్కి-పొగడన, బ్రహ్మదాని.
చ. సరసులు సర్వతోముఖవి, శంకటదివ్యర సైకమాధురీ
భరితములై సదాశిఫల, భావ్యములై సుమనః పరంపరా
స్థిరవిల సత్ప్రభాకరవి, జృంభణ నిత్యవిలాస యోగ్యతన్
సరసులఁ బోలి,యప్పురిని, సంగుస రాజమ రాళలీలలన్. ౧౯౩
సీ. కల్పపాథోరాశి, గడలుగప్పిననాఁడు, కరటిపోఁ కెలుఁగర, క్కటిక గ్రుహలు
నిత్యసృష్టివిధాన,నియతి"ధాతా యథా,పూర్వ"మన్ శ్రుతికథ,లప్పసఁగవచట
నణిమాది సంసిద్ధు, లాబాలవృద్ధంబు, పెరటిచెట్టులఁ బోలి, పెరుగునచటఁ
బ్రకృతిలో జగమెల్లఁ, బరిణమించినఁ బరఁ, ధామమై వెలయున, త్తావలంబు
గీ. హరుసిశూలంబు, హరి చక్ర,మైనఁ గాని, మసలఁ గానిని జాజ్వల్య, మానశక్తి
ప్రహరణమ్మలువెలయున,వ్వట్టణమున,బురమచర్చిక పొగడంగఁ,దరమెదాసి.

సీ. అప్రతీకంబులై, యఖిలదిగ్జయ మిచ్చు, గలసుప్రతీకస, త్కులగజములు
హరితురంగ పదక్రి, మాస్వతత్వమె కాక, ఘనకళ్లల తురం, గమ చయంబు
ఏకచక్రవిలాస, మెనయు నర్కుశతాంగ, సరణిఁ గెల్చుననంత, చక్రరథము
లతిలోక విక్రమో, ష్యద్బాహువారిద, ప్రశమితా శాతాప, పటులు భటులు
గీ. గలిగి యప్రాకృతప్రభా, కలితలలిత, నిత్యసౌభాగ్య నిరవద్య, నిర్నిరోధ
నిరతలీలావిభూతిచే, నివ్వటిల్లు, నగరతల్లజ మలదానిఁ బొగడవశమె. ౧౯౭
క. వనములు శుకపిక గణజీ, వనములు సిద్ధాశ్రమస్థ, వాచంయమిపా
వనములు పరిమదాకలితా, వనములు చెలువొందుఁ బూపు, పాన్తములందున్.

* నాయకాభి వర్ణనము. *

ఉ. అన్నగరీపు రాకృతత, పోతి శయ, ప్రతి పన్న భాగ్యభా
వోన్నతదివ్య మూర్తియయి, యొప్పె సుమాంబః కోటి రూపసం
పన్నవ నీయ తేజ మున, భక్త జనావన శాఖి సత్కృపా
పన్నశరణ్యుఁ డిష్టగణ, బంధుఁడు శక్తిధరుండు నేతయై. ౧౯౯
ఉ. అమ్మహా నీయ మూర్తి కరు, ణామృత నిర్ఝర మాత్రి లోకమై
క్రమ్మి నిశాటఘూట భయ, కంపిత మూర్ఛిత చేత నావళిం
బమ్మెరఁ దీర్చిప్రోవ సుర, పాల ముఖస్తుతి పాత్రుఁ డైప్రమో
దమ్ముల కాలవాలమయి, ధైర్యధురంధరవృత్తిఁ జెల్వొగుర్. ౨౦౦
సీ. ఏమహామహుఁడీశ్వ, రేశ్వరునాజ్ఞచే, బ్రహ్మాండ ములకెల్ల, భర్తయయ్యె
నేదివ్యమూర్తిప్రబ, హ్మేంద్రిరాపతులపైఁ, గొంచకయాజ్ఞఁజె, ల్లించుకొనియె
నేభవ్యుఁ డఖిలభ, క్తాభీష్టఫలములు, నించుచో వెనుజూడఁ, డేరఁడయ్యె
నేధీరు విక్రమం, బింద్రాదిక వ్యథా, ధ్వాంతంబునకు బాల, తపనుఁ డయ్యె
గీ. నట్టికల్యాణమూర్తి భ, క్తాంతరంగ, తామరసభృంగమైజగ, త్ప్రియముఁ బ్రోవ
సిరులనలరారి యెల్లరు, చెడనిపదవి, సిద్ధసంకల్పు లగుచుఁగాం, చిరశుభంబు.
ఉ. కావర మూను దైత్యతతి, గర్వము డుల్చి మహేశు కోటిలో
నావరణాధి నాథుడయి, యంతటసర్వ పదాధి కారియై
స్థావర జంగ మాంతరభి, సర్పణమున్ మనుజార్థ దివ్యల
క్ష్మీవరదాన కౌశలముఁ, జేకొని యేలెను గౌర ణార్యుడున్. ౨౦౧
సీ. భారతీముఖదేవ, భామినీకుచతటీ, పాటీరపంకాప్తిఁ, బాయదయ్యె
హరిదంగనామ, నోహర సభామధ్యంబు, లతిలోక సమ్మదో, న్నతి వహించె

భరిత భూసుర మహా, ధ్వర యూప భవనంబు, లుదు హోమ ధూమంబు,
ధురములయ్యె
సర్వసర్వంసహా, సకలసజ్జనపాళి, యకుతోభయభ్రాంత, మగుచు నలరె.

గీ. నిరతనిర్వక్ర విక్రమో, న్నిద్రభద్ర, మూర్తిశిఖివాహనునిదయా, స్ఫూర్తి నెల్ల
దితిసుతకృతాపద లడంగి, త్రిభువనంబు, సవాజ సౌఖ్యాను భూతిన,స్వ
హము గనుట. ౨౦౨

వ. మఱియు నమ్మయూర వాహనుండు నిరవధిక యశఃప్రసార మాలతీ కుసుమ సౌరభ సుగంధి భువనత్రయీ హోమధ్యాన సముద్వేల్ల దసంత కల్యాణగుణ పరంపరా వీరుచ్ని కుంజ పుంజ ఛాయాసుఖిత దితిసుత కృత వ్యథా గ్రీష్మోష్మ సంతాపిత నిఖిల జగజ్జన జేగీయ మానమహిత మహిమాను భావుండును, హృదయార వింద నిష్యందమాన మకరంద ధారాపరి వర్ధిత భక్తిరస సేచన నీరంధ్రీకృత దేవదేవ దయాలతాని కుటుంబ సంభావిత సద్భావుండును, అనవరత సిద్ధ విద్యాధర కన్యకాసము పగీయమాన నిజనామాంకిత ప్రబంధగద్య పద్యావళీ నిరతిశయ మాధురీ సుఖాస్వాదన సముల్లాస సాగర సమవ గాహనప్రమోద మేదుర భక్తజన సమూహా చండ కోదండ పాండితీ సముద్దండ భుజాబల నిర్వక్ర విక్రమా క్రాంత తారక ముఖ బలవ దరాతి దురవగాహ వ్యూహుండును, నిసర్గ సర్గపాల వాత్యయ క్రియానిరత భువనేశ్వర శిక్షాప్రవర్తన దక్షకటాక్ష వీక్షణుండును, నిరంతర నిరంతరాయ మానతపస్స హన దుస్సహమహర్షి మనోరథ ప్రదాన సంధానిరర్గళ సావధాన మహోల్లాస రక్షణుండును, దశది గంతరా ప్రతిహత గమన కౌతూహల నిరంకుశ బలోన్నిద్ర భద్రంకర మయూర వాహనాకుంఠ, సంచరణ లీలాలోలుండును, సమను స్యూత శివాద్వైత సంధానావధాన శీలుండును, శతకోటి మదన సౌందర్య విభ్రాజిత శరీరుండును, దేవాసుర భయంకర కదన దుర్నివారుండునై యొక్కనా డమందానంద కందళిత హృదయార విందుండై యరవిందాసనప్రముఖ నిఖిల బ్రహ్మాండాధి నాథులు సభాకూటంబులం బిక్కటిల్ల, ఝణం ఝణిత మంజీర రావంబులు, మృదంగ ధిమిధిమి ధ్వానంబులును, కలక్వణిత కంకణా రావంబులు, బెనంగొన సభి కాహ్లాద పాత్రంబులై యప్సరః పాత్రంబులు నటింప సిద్ధవిద్యా ధరచారణాదులు జయజయ శబ్దపూర్వకంబులైన స్తుతిపాఠంబు పఠియింప, సనక సనంద నాది

మునిపుంగవులు ననాది పురుష భావోప న్యాసంబు లొనర్పఁ దుంబురు ప్ర ముఖగంధర్వనములు విపంచీ ప్రపంచ చంచన్మధురగీత నాదంబులు సేయ, నానావిధ ప్రణీత ముఖాభి ముఖ సాపత్యమాన నిఖిల కమలజా ఢ నృత్తా, లంబులు పీనులఁ జొనుపుచు, సభాగురంతే జోదుర్ని రీక్ష్యాండమి యసర్ఘ్యమ ణి గణఖచిత శాతకుంభ స్తంభ విజృంభణ ప్రభాధగద్ధగిత సభాభవ నంబు నానుఁ బేరోలగంబుగాఁ. ౨౦౩

గీ. దేవకాంతా జనంబుదే, దీప్యమాన, దివ్య మణిమయ దాతసు, ధీనములైన చాపు చామరములు వీవ, సరస, సరస సఖినరులతోఁడ సభగోష్ఠిఁ, జను పు కొనుచు. ౨౦४

సీ. కరుణా కటాక్ష వీక్షణ సుధావారాశి, యాత్మైక శరణుల, యందఁ బొరల జలుతె నెన్నెలపొంపు జినుఁఘు లేనగవుతో, ముఖకాంతినెలతెప్ప, మొలకలెత్త మురిపెపు లేఁ బ్రాయముసమేని సునుఁ దేట, నలరాజుగుంపున, న్వాంబుఁ జూప నెమ్మొగిరతిసొపు, ఉన్మోలిమ్ముగుకల్మిఁ, గొండుబొక్క పుసేయుఁ, గుల్కరింపఁ

గీ. గొవముపొంగఁపుఁ బంగుసొంపు. గుంపులీను, చిత్రసింహాస నమునునా, సీమఁ గుముఁ, గొలువుఁ దీరిచికూర్చుండి, కొమరుసామి, రాజ సముసూర్తిఁ గొను చాయ, రహివహించె. ౨౦౫

గీ. లెతసుశీస్తంభ రుచితటి, ద్ధగధగలను, ప్రసుతికృతిస్తుతిపాఠ గర్జితరవముల మహిత స్రామాణి ధూపధూ, మముల మొయిల, సభజగర్జన నదమునాఁ బ్ర భఁదలర్చె. ౨౦౬

క. అందు మణీ మయ హారంపుఁ, గందువ నాయకము మెఱయు, కరణి సదస్యా నందకరుఁడొచు మెఱసెన్, స్కందుండ స్పందవిభవ, కందంబనఁగాన్. ౨౦౭

ఉ. ఆసమయంబు నందుఁ బ్రమ, థావళిచుట్టు జయధ్వ నిగ్రమో ల్లాసముతోడఁ గొల్వఁ గమలా హృద యేశ్వరుఁ డాప్త వృత్తిచే నాసయిడ న్గజ్జనని, యంబిక తోడఁగు మారవీక్షణో ద్భాసమ నస్కుఁ డై శమున, భంజనుఁ డచ్చటికిం గృపామతిన్. ౨౦౮

సీ. బాసవాల్గొరలయ, బ్రంపుఁ బొగడ్తలనుకుల్, మన్నుమిన్నొరసి సంబరములీనఁ దెరగంటి తెఱవలా, ద్దికవీచువింజామ, రమ్ముల తెమ్మరల్, గ్రమ్మ కనఁగఁ దొలుఁబల్కు గముబురూ, పుుదార్చి యుతుంత, స్వస్తిసేయుచుఁ జయ, స్వా నములిడఁగ

తుక కత్యంత మనోభవ వ్యథనము, దూ్యతోన్నతిఁ గాంచినన్ ౧౩౨

ఉ. కన్నుల నీరు కాల్వలయి, క్రమ్మఁగ నమ్మగ రానినారలీ
యన్నలు కన్నులాన వల, పారడిఁ బుచ్చితి నేమి సేతు? నే
నెన్నఁడుజూడఁ గందునొకొ, నింపుగఁ గాంతుని మోముదమ్మియుం
చన్నలి నాత్మి చాల వెత, కగ్గలమయ్యె విషాద వేదనన్ ౧౩౩

గీ. అంతఁదహతహతో బోటు, లలమికొనుచు, నూరడించుచుఁ గేల్దమ్మి, నూర నునిచి
సిద్ధపుంజెక్కుటద్దము, ల్నిమిరిచాల, బుజ్జగించియుఁ దమిమించి, పొరలిపార,

చ. తమతమ నేర్పు లేర్పఱచి, తామర రేకున రక్తిఁ గూర్చిఘుం
ఘుమఘుమవాసన, ల్గురియుగొజ్జగినీటఁ గురంగనాభిచూ
ర్ణముఘుటియించ రంగులని, గారముతోఁ గొనఁ గోటఁ జెల్వవిం
దుముదముతోఁడ వ్రాసితగ, టుంబనిఁ గ్రొంజగినిల్పి యోర్పునన్. ౧౩౪

గీ. చిత్తరువు వింతఁజిగిఁగొల్పి, చిత్త వృత్తి, వలఁపుఁ దమిఁగొన్న భావంబు, వల నుకొల్పి
నెమ్మనమ్ములఁదద్భావ, మున్మలింప, భావశుద్ధిమొనర్చియ, ప్పటముఁదెచ్చి.

చ. కిలకిలలాడుచున్ బహాయలు, గీల్కొనముందర నిల్పునంతలో
నులికిపిియుం గనుంగొనిప, యోజకరంబులఁ గంకణధ్వనుల్
కలితపదాంగద ధ్వనులు, ఘల్లున మ్రోయఁగ వేగ లేచియ
చ్చెలువలు మాటునన్నిలువ, జేడెలుగొల్లున నవ్వియుంతటన్. ౧౩౫

గీ. ఇట్టిపసిగొలకీవెట్టి, యెట్టులనుచు, నంబుజాక్షికినెదురై ప, టమ్ముఁ జూపి
పిియునియాకృతిగానిత, ల్ప్రియుఁడుగాఁడు, నీకటాక్షాంచలం బిందు నెఱపు మమ్మ. ౧౩౬

చ. అనిమదినమ్మఁ బల్కసహ్య, దంతరదంతుర మోహవల్లికా
వినమిత దృష్టివల్లమల్లు, వెన్కకుసంగుచు ముందు ద్రొక్కుచున్
బెనఁగుచుఁ జుట్లుగొంచువల, పించుచుఁ గొంకుచుఁ గోరఁజూచుచున్
గునియుచు గుంపులైయలమెఁ, గోర్కె ప్రియాకృతి పైఁ దటాలునన్. ౧౩౭

క. బోటికి మువ్వాంటికినల, నాటిప్రియాలోకనమ్ము, నాటినతమిము
న్నీటిక్రియఁ బొరలనుమశర, కోటికినగ్గమయిమూర్మి, కొనసాగంగన్. ౧౩౮

ఉ. చన్నులనొత్తి యొత్తిమ్మ, నసారఁగమోమునఁ జేర్చిచేర్చి చే
గన్నుల నద్దినద్దిమెదఁ, గ్రమ్మఁగఁ గౌఁగిట నుంచియుంచియా
యన్నులమిన్న పెన్నెసట, నంబుజగర్భుఁ ప్రాసికూర్చెబో

నన్నని ప్రొక్కి ప్రొక్కి కల, నావినివేశిత చిత్తవృత్తిమై ౧౩౦

సీ. అందంపుఁజిగిఁదేరు, పండారుమందాసు నాననపఙ్క్తిభలమే, లరసి యరసి
అరుణాబ్జములఁ గేరు, తరుణారుణచ్ఛాయఁ జరణంబులనురక్తిఁ, జగిపిజరపి
తళుకుమించులఁదళ, త్తళలీనునఖకాంతు కన్నుసోగలవింతఁ, గాంచికాంచి
పొంగారుబంగారు, రంగుశృంగారంపు మేనిసిగ్గులఁజూచి, మెచ్చిమెచ్చి

గీ. అతివతత్పారభావిత, మైనయట్లు చెలువుప్రతికృతినక్కఁబైఁ, జేర్చిచేర్చి
చిత్రలిఖితాకృతివహించి, చేష్టఁదక్కి యెఱుకమఱపులు లేనియ, భీష్టమొందె

క. కరములనప్పటి ప్రతికృతిఁ, గరమనురాగమొగినూనఁ, గలుఁగుట సతికిం
వరునికరగ్రహణముబలె, నిరతిశయానన్దసౌఖ్య, నీరధిఁదేల్చెన్. ౧౩౧

చ. తొలఁగఁగఁజూచుఁ సిగ్గుదమిఁ, దొట్రిలమై యరహించు సైపలే
కలయుచు నోరఁజూచుఁ బలుకాఁడవిదేమి; పరాకటంచునో
త్తిలిపలికించఁ జూచుసుద, తీమణితథ్యము కాతలంచియ
చ్చెలువుని చిత్రరూపుఁగని, చిత్తజవేదన కోపసైపకన్. ౧౩౨

మ. నిలువెల్లందనివోవఁ జూచిమిగులన్ నెమ్మోము నన్మోహహాసం
వలనోచప్పన దృగంతసంతత సమా, వల్గత్పరాయత్తతా
కులహృద్భావనసూచనప్రకటసం, కోచస్ఫురద్దైన్యముల్
లలనారత్నము నాత్మహేతుకముగా, లాలించి తానిట్లనున్. ౧౩౪

ఉ. ఎందుకుసందియంబు రమి, యింపుమునింపుము కూర్మినీకున
స్పందమనో రథంబనయు, పాల్పడితిన్దయ సేయరాదె? యీ
డెందపుఁ గొందలంబుఁ బ్రకటించుచునున్నది మోముడమ్మియే
మందుదయాపయోధి! తగునా? వశవర్తిని యియ్యుపేక్షకున్. ౧౩౫

క. ఇవ్విధమున నాజవ్వని, యవ్వముదపుకొత్తఁజిత్త, మహితుహితునిపై
నెవ్వగల నొవ్వనవ్వల నవ్వలపుల నమృతవల్లి, యవ్వనిలోనన్. ౧౩౬

* అమృతవల్లీ విరహము. *

లయగ్రాహి. అమ్మహితునమ్మునెడ, ముమ్మరపు బమ్మెరలు
గ్రమ్మి చెలు వమ్మెడలి, యమ్మలికమించన్
తమ్మివిరిగుమ్ములను, ఘుమ్ముమను తెమ్మెరల
కమ్మద నమున్మెదలు, తుమ్మెదలయిమ్ముల్
సొమ్మసిల గ్రమ్మఁగను, కమ్ములు పికమ్ములర
కమ్మలయు కమ్మకల, డమ్మగను కొక్కల

జిమ్ముటకు నెమ్మొయిషి, ఢిమ్మెరు దశిమ్మగొవ
గ్రివమ్ముగాడి యమ్మెలెడ, లమ్మనీ దలంకేళా. ౧౩౮
సీ. ఘనసారవాసనల్, ఘుమ్మనంచుచుపిం, పులికింగ్గునలేవ, నూహసేయు
కంకాశిహితభృంగ, ఘుంకారమాలించి బాకపందిటపిడ, దాగనులయు
సకియాత్మపోష, జ్ఞమునువెళమునూర్పు నెవలేమిఁ దలవాంచ, నిచ్చగించు
బాపుప్రాపుకటి మెచ్చంగఁ బోటులేయుచో నెమ్మేనువలిపెమ్ము; గ్రమ్మఁజూచు
తే. గీ. జముఁ మగ్గలమైనయ్య, త్తఱిఁదలంచి తనకుఁ దావచ్చి దయసేయుఁ, దలఁపుఁ గూర్చు
వల్లభునిమేపవలఁపుగ్రై, వారమాత్మ యానహాసమ్ములనిసన్ని, ధానమాట.
చ. వలపుల్ గొల్పుచుఁ జనుల, వాడలవాడల నెల్లఁ జోటులన్
మెలఁగుచుఁ జెన్నెట్లులొలిపి, మెచ్చొనరించు సుఖప్రదాయి! యో
మలయసమీర! వల్లభుని, మైఁబొలయంగల వేళసీమది
దలఁపుము నన్ను నీవలన, ధన్యతఁగాంతుఁ బరంపరాప్తి చేకా. ౧౩౯
చ. కృధురవియోగ తాపపరి, పీడితమచ్చటు లాంతరంగసం
గ్రథిత సుఖాసనుండవయ్య, కట్టశిషైన ననుంగుఱించి యు
వ్యాధి సహించితో భవద, భీష్టము నేనపుడ్ వియోగజ
వ్యథఁగొనితాప యుగ్మమున, నయ్యోను? చల్లదనమ్ము వల్లభా! ౧౪౦
ఉ. చక్కెరమావి పండ్లుమధు, సారమనంటుల పండునత్తముల్
చక్కఁ బునాసఁ బోలుతెఱ, చుంగశిమాగడ లైనగాంత! సీ
మక్కువఁ గొంగిటన్బెనఁగి, మన్ననసేయ ధరాధరమ్ము బ
లొన్నిక్కుల గంటిఁజేసితివి, నొవ్వకనాను సుధాస్వకించునే? ౧౪౧
చ. ననుగనునంత నీమనసు, నామొదనాటు లెఱుంగనైతినీ
ఘనతర హృద్గభీరతలఁ, గంటినయేని మనోభవవ్యథా
కనదతి తాపవేదనలఁ, గట్టసిసైనినునొప్ప గింతునే?
యొనరుననుపాయ మాతసివి, యోగభరజ్వర మార్పకుంటునే? ౧౪౨
తే. గీ. గురుజనాధీననునుచున్న, కోచమేలు; కాంత! సచాపురుదులలో, గల్గునకీలి
హృదయము సంగమమయ్యేని, కేటికడమ? మాకనీమాన నీదాన, నైనదాన.
చ. చిలుకనగూర్చితాతు నకుఁ, జెల్లులనైనను నీతిమాలినన్
నలుమటఁ జెట్టినాగసని, యమునుటనేరమి యెట్లుపన్నఁగా
వలచిన ఘనునిసుఁ, వశ్యమునన్ సినుఁగూర్పఁ గోరెఁగా
[illegible] కట్టినకంతు పిపావనేసనల్? ౧౪౪

మ. తెలిదుఁ బ్రభువ్యాసకలార్థవేత్తలని వే, దంబుల్ప్రవచింపంగ బా?
తలపోయుం దృణధీనసాధనసు న, ర్థం బేల భావించరో?
తెలియం బోలునదైన వల్లభ! నినుం, దేరాదె? మజ్జీవనా
కులతన్ దీరుప రాదె? యేలపలుదా, కుల్ కర్మభోగ్యంబగుల్. ౧౮౫

క. నాసీజనకులు హరిహరు, లీనగ్మిగఁ గననివార, లేటికి నీకసం
ధానముఁ జేసి గుహాశయు మానిష్క ళ మద్వితీయు, ననుసంధితురా. ౧౮౬

చ. అనుచు ననంత భావనము, లాతలఁ బుల్లడపోసి యెవ్వియుల్
మనమునఁ బెట్టకార్తిమెయి, మగ్నత బాహ్యము ఖేంద్రియస్పృహా
వినమిత వృత్తి నాంతరని, విష్టచిదాసన సంస్థఁ జేసినా
ధునిఁ గవఁగూడి షేన్మలబది, తోయరుహాసన పూర్ణభావయై. ౧౮౭

చ. అనుపమ మూత్మవేద్యము సు, ఖానుభవ ప్రతిపన్న మన్యవే
దనరహితంబు నిశ్చలని, ధానవిధేయము నిత్యభోగ్యమ
భ్యనుదిత భేదభావము గు, హాశ్రయమా ప్రమదమ్ము నొంది భో
వనపరి శుద్ధిఁ జెంది యని, వారణ వారణయాన యున్నెడన్. ౧౮౮

చ. పగచుచు బోటు లేమమృత, పల్లియొకానొక సారియై నమే
సొగయదు పల్కరింపదుపి, నోదముఁ జూడదు చిల్కకైన మా
టఁగలుపఁ బోదు పాటకును, డంబడ జెట్టి ప్రచార మొక్కొ? వీం
తగమదిఁ దోఁచు చున్నయది, తథ్యము సత్వర మారయందగున్. ౧౮౯

శా. రారమ్మా చెలులార! చూడుఁడిదె నే, రం బేమియున్ లేదు డు
ర్వారక్రోధవశంబు మోమునఁ బరీ, రంభించుట ట్రోఁచెనె
ల్లారుం గూడుదిటంచుఁ జేరఁ జనుచున్, లాలించు చుస్దీనవా
చారంభంబున వేఁడుచున్ మనసు మె, చ్చన్గోలి మువ్వాఁడుచున్. ౧౯౦

సీ. ఓయమ్మ నీమాట, కడుగు దాటక యహర్నిశము నీవారమై, నిలువ లేదె,
శిరసావహించినీ, చెప్పిన పనులలో విసువక నిల్చి మెప్పించలేదె,
మంతనమ్ముల నీవో, కింతఁ దెల్పిన గుట్టు బయలుగా నీకడ, బంగలేదె,
ఆటపాటల జాల, ననుకూల వృత్తిఁ జేఁ జనవొంది కాలంబుఁ, జరుపలేదె

తే. గీ. లేమ! మాయెడ నపరాధ, మేమిలేదు నీదు చిత్తమ్ము స్వవశమ్ము, గాదు మాను
మనవిపీనుల నానిలో, ఖమతనాని తెంపు గడకొల్తి మమునాద, రింపవమ్మ.

శా. పంచప్రాణము లీనకాని యతిసం, భావించి వాక్కాయ హృ
త్సంచారమ్ములు నీయధీనములుగా, సర్వాను షంగంబులం
గించిత్తుం దొలఁగింగఁ జాలకసదాం, గీకారభావంబురా
ణించం గోల్చిన మాయెడం జిగురుబోఁణీ! యీసు నీకేటికిన్. ౧౩

ఉ. ఎన్నఁడు నీదు నెమ్మొగము, హేతుగుణాయతి నొందదేమొకో?
కన్నడకైన నోపమికఁ, గన్గొనలెత్తి కటాక్ష వీక్షణా
భ్యున్నతిఁ జూపుమింతటన, పూర్వము దంబొనఁ గూర్పఁ జూచుమం
చెన్ని విధంబులన్ జెలియ, లెల్లరు వేఁడిన నించుకేనియున్. ౧౪

క. కన్నెత్తి చూచి మోమునఁ జిన్ని నగవుదొలకఁ బలికె, సేమమరసితాఁ
గన్నులు చల్లఁగ నన్నుల మిన్న యొకింతైనఁ గనక, మిన్నకయున్నన్. ౧౫

చ. వెలవెలఁ బారుమోములను, వేమరు గన్నుల నీరుగాల్వలై
వెలువడ నల్దెసల్గనుచు, వేదురు పట్టిన భంగి నెచ్చెలుల్
తెలియక తత్తరించు చును, దీనతఁ జేతుల నంటు చున్భయా
కులమతి విహ్వలించుచును, గొందల మందుచు నున్నయంతలోన్. ౧౬

—* కలకంఠీ కలానైపుణ్యము. *—

చ. చతుర కళార హాస్యములఁ, జారువ చోరచ నాచమత్కృతిన్
సతతప రేంగి తజ్ఞతల, సారక విత్వర సానవద్య హృ
ద్యతల గుణక్రియాను కృత, దాత్యములన్ సడిసన్న బోటియొ
క్కతె కలకంఠినా చెలులఁ, గాంచి కరాంగుళి సన్నఁ గోల్పుచున్. ౧

చ. బెదరకుఁ డింతులార! పల, వింతురె యింతటిలోన మీదటి
త్తెద గణియింప లేరు మన, కేటి యవజ్ఞలు ప్రాణమానముల్
సుదతివె కాచరింతు మిటు, జూఁడుఁడు బోటితలంపు వేళునా
మది వివరించి యంటె నను, మానము లేదువినుండు తెల్పెదన్. ౧

మ. అలరాజు న్వలరాజునిర్వ్యరును జో, డైయాడుగా రాని ని
స్తుల సౌన్దర్య ధురంధరుండు గుహుఁడ, స్తోకప్రభాశాలి యు
జ్జల జాతాక్షుని చెంతనుక్కడ సభా, స్థానంబు నందుండ నీ
... బోటి గనుంగొనన్ హృదయ బ్బద్ధంబైన వాల్జూపునన్. ౧

తే. గీ. చూచి నప్పుడే ...

కఱఁగె నెఱ ప్రొంత వెన్నగాఁ, గఱుఁగ కేల
యుండు నమ్మూర్తిఁ గనునట్టి, యువతులకును
తత్క్షణంబున సాత్త్వికో దయముగాదె? ౧౨౯

చ. అదిమొదలీ వెలంది హృద, యంబుర యంబున కాలవాలమై
యొదవిన మన్మథా నలఁపు టోజగణింపఁ దరంబె? యంతమై
యుది మొదలంత కాంతయుఁ, యావల నావలఁ గొండ యంతమై
యొదిగె వశమ్ముగా దొరుల, కేర్పడ నార్ప గుహుండు దక్కఁగన్.

తే. నాఁటి పురులద్రి మథనుపై, నాఁటియున్న
దేటి మాఁటలు తమకంపుఁ, జెలివికిలిని
యగ్గలంబైన తమిఁ జొక్కి, యాత్మనాథు
పైని గీల్కొల్పి నవనవా, వస్థనొందె. ౧౩౦

చ. చలువలు జల్లు జాడవిడి, శయ్యప యింబవళించి కన్నులన్
జలజల రాలునీరు జల, జాతి జలమ్ముల పేరమార్పచున్
జెలువుని హావ భావగుణ, చేష్టలపై మరులొంది యెద్దియున్
దెలియకఁ బారవశ్యమునఁ, దీకికమై చెలియున్న యంతటన్. ౧౩౧

క. మనసీని వేళయని సీమనసునఁ దలపోసి చెంత, మార్మసలుచు నె
య్యాన నీవల నానల గాఁజనుచున్ వచ్చె నను దిరుగు, సమయము నందున్.

తే. కొంతసే పోర్చినను జూచి, కొమ్మనెమ్మె
నమ్ముదిటకొప్పి కనుసన్న, నన్ను బిల్చి
నాడు చనుమిట్టలూఁతఁగాఁ, గ్రోచికొనుచు
మేనుఁ జేర్చి తెమ్మిఁ జొక్కి, లోన నణఁచి. ౧౩౨

మ. కలకంఠీ! కనుగొంటె? మాలతి యుపస్మాప్తికిఁ జెంగటం
జిలు నుద్యత్సహకార వేల్లనము వాంఛింపగఁ బోలన్ల సం
చలదామంద మరుత్కిశోరకలనన్, జవ్వాడుచున్ మాటికిన్
బొలయం జేరవఁ దూగుచున్న యది యో, శోభింత గన్గొంటివే. ౧౩౩

మ. అనుచుం బల్కినఁ బ్రస్తుతోక్తి మదిలో, సప్రస్తుతవ్యాజనో
పనతమ్మై శశిశేఖ రాత్మజునిపై, భావంబు నాటించదీ
యనవాకీ నృళీన వాంఛ ముట్లు ఫలితం, బౌనంచు మే బాఁగోరుచున్

యని వాక్యార్థము నిర్ణయించెనఁట నెయ్యం బగ్గలం బొటచేఁ. ౧౬

తే. గీ. చేడెఁ గౌఁగిలించి, చెక్కిలి ముద్దాడి భావశుద్ధిఁ గడును, బన్యసించి
యింగితంబుఁ దెలియ, నిచ్చఁ గొల్పి యొకింత ముచ్చటింప నాదు, మోము
జూచి. ౧౭

చ. మదవతిరో! రసాలఫల, మాధురి వాచవిఁ గొంచు నింతికిం
పొదవఁగనంది యిచ్చుచుఁ బ్రమోద యుతల్ ముకుబంటి గాగమైఁ
బొదలుచు మోము మోములమి, పుక్కిటఁ జక్కెర మెక్కఁ జేయుచుఁ
వదలని కూరు ముల్నెలపు, వైఖరిఁ గీరము నందుఁ గంటివే?. ౧౮

ఉ. నావిని యుల్ల నవ్విలలనా! భవదీయ వచోవిలాస సం
భావన మావహించెనిదె, వల్లభుతోఁ గవఁ గూడి పూర్ణ పుం
భావవిహారము ల్సలుపు, భాగ్యముఁ జేకొనఁ గోరునర్థమా
గావనజాక్షి! యెవ్వనికిఁ, గల్గునో తావకదృక్సు మార్పుతల్. ౧౯

క. మన్ననకుఁ బ్రథను పాత్రము గన్నను మన్నింతుఁ గానఁ, గడఁద్రోయక నీ
కన్నుల యాన భవద్దయ కున్నెలవయి మనము, గుల్తుఁ గొను ఘనుఁడవే
క. కామిని యమృతధారా సారము వీనులకుఁ దొరఁగ, చానరో! కరుణా
పూరితమానమునఁ దెలుపం గారాదేనేఁటి చెలిమి, కత్తైన యనర్గా. ౨౦

చ. కలిమిమ యూరముల్ల యదె? కంటివె? చిత్రచి రత్నరత్నసం
కలితఖలీన పల్యయన, ఘట్టిత మానోక కత్తులాని సొం
పొలయుచు నున్నదీ చెలువ, మూహయొనర్పు మవ్విఁ జగత్త్రయీ
లలితుఁడు నాయకాగ్రణికి, లాలన కుందగు నాతఁడెవ్వఁడో. ౨౧

చ. అనుమధు రాథరాధరసు, ఘానుకంపంబగు పల్కు చెక్కనల్
దొనకిన నామదిం దొలుతఁ, దోఁచినయట్ల వచించెఁగాన ని
వ్వనిత మనంబులోఁ గొనిన, వాఁడగు నిక్కము బహ్విధోరణుం
పని మది నిశ్చయించి విన, యమ్మున నిట్లని విన్నవించితిఁ. ౨౨

ఉ. చిత్తరి నీతలంపు దగుఁ, బెంపొనరించు నతండు నీకుమే
నత్తకుమారుఁడీ ఘటన, మార్యులు మెత్తురు మట్టువాఁడనీ
చిత్తము జాలికిఁ నశము, నేయుకు నీతలిదండ్రులుం ద్వదా
యత్తులటంచు మద్దోక్తిలి, న్నాఁకప్రియోక్తుల భాను వృచ్ఛితిఁ. ౨౩

క. అదిగావున నిమ్మదవతి, మదినొడ బెనఁగుహలుని మీఁడి, వామతఁ బెరపఁ
స్పదమై యనుశయ భరమెదఁ గదురుట యిమ్మరపు మోహ,కలనంబనినన్.
మ. సపఁగాలా జనరాలి మాలిమిదురం, తానంత చింతాభరం
బవరోధింపఁగఁ దత్తరింపుచుఁ గటా! అయ్యయ్యో? యింతేల? న
మ్మ! విచారమ్ము దిటమ్ము సేయుమదిఁ బ, ల్మాటల్లు నీజాలిచే
బవలున్ రేలుఁగృశించకమ్మ! యనుచుం, బైపైఁ గుముల్గూచుచున్. ౧౭౩

—* చెలికత్తె లమృతవల్లికి శైత్యోపచారములు సేయుట. *—

సీ. గొజ్జంగి మంచుతోఁ, గూర్చిన కలశంబు నెమ్మేననలదెఁ గస్నియ యొక్కర్తు,
కపురంపు ధూళిఁజొక్కముగ ఘుమ్మనివాసనలుఁ గ్రమ్మఁజల్లె, నాతియొర్తు
పటివేళ్ల సురటి మవ్వముగఁ గేల్గవనూని కొసరి చల్లగ నంట, విసరెనొర్తు,
తమ్మికాడలు మేన, దళముగాఁ గ్రొమ్మావిచివురులతోఁ గూర్చి, జేరివెయొర్తు
తే. గీ. చలువ జాజులు పటువు బిల్లలుగ దిర్చి
యడుగు దమ్ముల నద్దెన, య్యెడ నొకర్తు,
విరహ సంతాప భరమున, వేగునమృత
వల్లి వెతఁ దీర్పఁ బూబోఁడు, లెల్లఁగడిసి. ౧౭౪

ఉ. ఎవ్వరితోఁడఁ దెల్పు దమిఁ, కెవ్వరి త్రోడుణ మందలింత మిం
దెవ్వరు మాదె యుగుదురొ? యెవ్వరి వేఁడుద మేమిసేతుమో?
జవ్వనులార! యెంతకని, సైపుద మేగతి నెందు జొత్తుమో?
యెవ్విధిఁ గల్గునేమనఁ గ, నెద్ది యుపాయము తేర్పనెట్లొకో? ౧౭౫
క. మనకిత్తఱిఁదగు చైదము, లను వెతఁగి యెఱుఁగసేయు, నట్టివయస్యల్
గననాదురె కన్నులు దె,ల్వొని గోలకు నింతయెడఁపు, గ్రాపించుటయే. ౧౭౬
సీ. వీణెఁ బాటకు మేళ, వింతమే మదిరక్తిఁ, దొలఁగిచల్లగ గ్రొత్తు,గ్గలుపునేమొ
సరసమోహన శాస్త్ర, పరణిఁ జప్పఁతమే సిద్ధాంతమే మైనఁ, జేయు నేమొ
చతుర సాహిత్య ప్రపఁ, సఁగ యిఁలేసితమే వ్యాంజనాదుల రూఢి, పఱచునేమొ
చెలఁగి బొమ్మలపెండ్లి, సేయనూహింతమే తీర్పఁ బెద్దఱికమ్ముఁ, దెల్పునేమొ
తే. గీ. విరులు గోయంగఁ జనుదుమే, వేగముందు
నీరములు దూరితాఁ గోయ, నేగు నేమొ
అచ్చు నభ్యాశ వశమున, నైనసువతిఁ

దేర్పి తొల్లింటి పనులెల్లం, దెలిపి చెలులు. ౧౭౭

క. కన్నులు దోవలం గ్రమ్మంగ, జన్నులం బూగుత్తులలమి, చల్లని కపురం
బన్నవలా చెక్కులనిడి కన్నెలు సంబంధి సఖ్య, గరిమము జూపన్. ౧౭౮

క. విడరాని చుట్టముల గని, యెడతీవని పారవశ్య, మొనసిన గతియా
పడంతుకలిసి సుపచారము, లుడుగనిమది మమతం బెనిచె, నువిదకుమిగులన్,

చ. సతులుపచార ముల్మిగుల, సల్పియు నించుక యేనిబోటికిన్
వెతననం గించి తెప్పరిల్లి, వేగురుమానంగం జేయలేమినా
తతహృదయవ్య, ధంగలంగి తందరం జిందరం వందరాచునే
గతింగన రామినెమ్మదిని, గాఢవిచారము నొందుచుండంగన్. ౧౭౯

చ. కలంగకుండింతులార! యొక, కార్యముం జెప్పెదం బ్రాణనాథుపై
వలపున బాహ్యమున్మఱచి, వర్తిలుగావ మయూర ధోరణిం
దలంచిత దీయ సత్కథలు, దారత సన్నిధి నుగ్గడించినన్
గలదొక వింత చూడుండిదె, కందెరచున్ మనలన్ గనుం గొనన్. ౧౮౦

తే. గీ. ఇదియె కార్యంబుగాని యిం, కేదిలేదు విప్రలంభంబునొందునీ, వెలదుకలుకు
గుహునిప్రవృత్తమ్ము మనముపా, క్రుష్ణవలయుంగార్యమీడేరుననికల, కంఠివలుక,

సీ. వనితయొక్కతె బర్హి, వాహనుసౌన్దర్యమభినుతించె జగత్త్ర, యాన్నుతమ్ముగ
మగువయొక్కతె సర్వ, మంగళానందను శౌర్యంబు జగదేక, ధుర్యమనియ
కొమ్మయొక్తెహిరణ్య, కుండలుచాతుర్యమతిచతురాననం, బనుచుంబొగడె
పల్లవాధరి యొర్తు, బ్రహ్మగర్భుని భుజా బలము లోకావన, ప్రకటమనియె

తే. గీ. చానయొక్కతె గుహునిరైశ్వర్యధుర్య
వినయ గాంభీర్యములు విశ్వ, విదితములుగ
సన్నుతించెను విజయధ్వ, జంబనంగ
నంతంగల కంతియును నిట్లు, లనియె నపుడు.

సీ. వలిపుల కట్టి చౌవంచ మెఱుపుల వేల్పు నానతి యిచ్చోటి, కరుగుదెంచి
కలిమిపుత్రుంబోండితో, వలమురిధాల్పుతో ముచ్చటింపుతలంపు, ముడివడ
జనపుతో సమ్మత వల్లిని దేవవల్లిం గోడండ్రుగాం గోరి, కొనునటంచు
వింటిమి కోర్కెం జే, కొంటిమి తొలిమేలు గంటిమి యువ్వాలు,

తే. గీ. వచ్చునట తాయుబారంబు, వచ్చునంత

శౌరి కూఁతుంద్రఁ డిచ్చుని, స్నాంశయమ్ము
వలపు ఫలియించె దైవంబు, తలఁపు మించె
నింతభాగ్యంబు వలదె యిల్లెందుఁ గలదె ౧౫౩

ఉ. ముద్దియలార! సర్వజన, మోహనుఁ డైన శిఖిధ్వజుండు వీ
రిద్దఱిఁ జూచి చాలమఱు, లెత్తి భరంపడి నాఁడటంచు ను
ద్వృద్ధయులై శివాశివుల, సారముదంబునఁ బెండ్లి సేతురీ
యొద్దిక పూర్వసంచిత ఫ, లోదయ మాపద చెప్ప నేటికిన్. ౧౫౪

తే. గీ: అన్నిప్రసంగ వశంబున, వాళులెల్ల, బర్హివాహను వృత్తము, ల్బలుకువేళ
నంతిపురమున శ్రీశ్రీవ, రాంతికమున జరుగువృత్తమ్ము గలకంతి, జరుపుకతన.

ఉ. వీనులఁ బ్రాణనల్లభుని, వృత్తము సోఁకిన మాత్రఁ బ్రాణముల్
లేనియొడల్సు ధారసవి, లేపమునన్ జలియించి సట్లు నె
మ్మేను గదల్చుచున్ మఱియు, మిక్కిలి ప్రైయేన వెతన్ దలంపులో
నూనుచుఁ గన్ను లెత్తి సఖి, యోచిత మాతమి నోరఁజూచుచున్. ౧౫౫

ఉ. సిద్దుర లేఁచినట్లు మది, నిండిన మోహాభరమ్ము వెల్లునన్
బెద్దయుఁ బ్రొద్దు దల్పమునఁ, బిట్టుగఁ బొర్లుచు నావులించుచున్
గద్దరి పోరిడగావున ర, కమ్మగు నవ్వాలవంత గుట్టు మే
నొద్దికఁ గప్పుచున్ జెలుల, నూడిగఁ పున్నమ గత్తరించుచున్. ౧౫౬

చ. మసలుట గాంచి బాలతన, మన్ననఁ గన్నది గానఁ జెంతకున్
వెసఁగల కంతిఁ జేరినను, వింతగఁజూచెద వేమనందు నీ
రసమున నేను బాత్రమనె, రక్తికి గాకటంచు మించిబ
ల్పసదుల కింపసిట్లనుచు, బల్కె మనోజ్ఞ కథా చమత్కృతిన్. ౧౫౭

చ. మదిమరు లేనుగంటి నీక, మాఁటలతోఁ బనియేమి? యన్నియుం
బదిల పఱుం దిటంబుగొని, భావము పల్లటిలంగ నీకునో
మదవతి! తాల్మిఁదూలిన క్రి, యాబగుగాని మఱేమి లేదు మే
లొదవెను నెల్లితేపటమ, దూర్జితమానుడి పిన్నమీనులన్. ౧౫౮

మ. జగముల్మెచ్చ మహా మహుల్పారిహారు, ల్సంబంధులై వియ్యమం
దఁగనూహించిరి గాన నిట్టి పనికిన్, దన్వంగి! చింతిల్ల నే
మగుఁ? సోఁ కోర్చుమునీతలంపిదియనీ, కైప్రాణ నాథుండు దా

వి॥ శక్తైస్వృత నెంతగుస్సేనొ? తడా, వేశంబు జూతింపుమీ. ౧౯౦
క. మన్నించి భావ మొకపరి కన్నియ! తెలిపితివిఁ గానఁ గడుఁ బెగడకనే
నన్నియు నెఱిఁగించితి నాకన్నను హితపరులు లేరు కన్నా! యనినన్. ౧౯౧
చ. తెలతెల వాఁడు మోముపయిఁ, దెల్వి ఘటించిల తొంగి పల్కెనో
నెలతుఁక! నీవుపల్కునుడి, నిక్కమవైనను కాంత సత్కృతుల్
జ్వలితద వంబులట్ల మది, సర్వము నీరొనరించె నేక్రియం
దలఁచక యుందు నెట్లు తల్లిదండ్రుల చిత్తములు స్థిరంగెడిన్. ౧౯౨
క. కలికీ! నామది లోపలి వలవంత యటుండనిమ్ము, వల్లభుఁడొ తే
నలమటఁ బడెనను నీనుడి ములికిగ నుల్లమున వెతల మునుగం జేసెన్. ౧౯౩
చ. నెలతరో! నీకుసాటి యగు, నెచ్చెలు లెవ్వరు లేరు నామదిం
గలయది దెల్పకుందునది, గల్గదుగావున బోధఁ గొల్పితిన్
దలఁపు ఘటించు కార్యగతిఁ, దత్పరవృత్తిఁ ద్వదీయ భావసం
కలనములోని దంచు నిఁక, గట్టిగఁ బట్టెద వేయి నేటికిన్. ౧౯౪
ఉ. నావిని సంతసించి లల, నా! వినుమొక్కఁడు దెల్పుదాననీ
భావము వేలెఁ గేకినయు, బాయక చిత్తము దేవవల్లికిన్
గేవల కంతు వేదనలఁ, గీల్కొని కోల్కొనఁ జాలదింతకున్
భావిఫలంబు నిక్కముప, పన్నతఁ గాంచెడు మీకు నావుడున్. ౧౯౫
తే. గీ. ఉల్లములు కంగ లేఁచి తా, నెయ్యనొయ్య
నమృతవల్లి వధూటితో, ననియె బోటి
యెల్లిదంబయ్యె సౌందర్య, వల్లి కేమి?
వలఁపుఁ దమిఁ యెంత చోద్యమీ, పలుకు వినఁగ. ౧౯౬
క. పసిబాల యిట్టిజోలిన్ మసలుట వింతయ్యె నట్టి, మతకము గనఁగా
నసమాన నాయకుఁడు గుహ్యరసిక తఁదా నెల్లెతింగె, నవ్వాలిఁ కేలా? ౧౯౭
ఉ. ఇట్టి నెపమ్మునన్ మనము, నేచువి యోగభరమ్ము మజ్వగాఁ
గట్టడి పల్కు పల్కెదను, కంపము కించుక లేదె నాతలం
బుట్టెనె విప్రలంభ కథ, బూమెలు పన్నెదు చాలుజాలునీ
బెట్టిదమంచుఁ బల్కెఁ జెలి ప్రేముడి మానిని గానఁ దాళుచున్. ౧౯౮

చ. ఎఱిఁగి యెఱింగి యిట్లు తగ, వేదిననుంగడు ఆవ్వ సేతురే
గుఱుతొక టుంగనుంగొనఁగ, గూడదె ప్రేలరిఁ జేసెదింతలో
మఱతురె నానునమ్మిక సు, మాళపు మాటల దీఱదక్కటా?
చెలకున దీప్తి క్రొత్తయొకొ? చెల్లెలి ముగ్ధత విన్నచెప్పెదన్. ౧౯౯
సీ. కొనఁగోట మీటిన, కనుపీటి చెఱుకుల సెగలదవ్వుల దూకు, చిగురుఁబోఁడ్ల
వెడవెడ నిట్టూర్పు, వేడికోరువ లేక చెంగిలూ గాడుశా, చిల్కగముల
నెమ్మేని తొపంపు, టున్మీలింపుల గ్రుగ్గు పరువంపు టిగురుత, ల్పముల విరుల
చలువలై యెడలెల్లఁ, జల్లుగొజ్జగిమంచు పొంగుసోఁకులదూటి, పోవు తేంట్ల
గీ. తేటతెల్లమ్ము గాఁగవ, ఘూటిలోన, బాటిలువియోగ సంతాప, భరముకరము
తెలియనగుచున్నదిం తేల తెలవ! నీదుబూటకముచాలు చెలిఁజూడఁ, బోదమమ్మ.
క. గాయక మెఱుగమి మరు విరిసాయకముల నొచ్చిమరులు, సందడిఁ బడియ
న్నాయక రత్నముపైఁ దమిఁ బాయకపటు విప్రలంభ, భరమున నొగిలెన్.
మ. చెలులాఁ జూడమ పాటనై సనుకటా! చిన్నారి పొన్నారి యా
టలపై నాస యొకింత లేదు నిదో, టన్నిల్వాఁగాఁ జూడదీ
వలపంతంతకుఁ బెచ్చుపెగఁ గసహిఁగ, పంజాలకీ బాలయు
య్యేలవో లెన్మదిఁ దూలియాడఁ జెలులెం, తేనాగి నందాళకన్. ౨౦౨
తే. గీ. వేగుచున్నది చెలిమస, మేగికలిసిమెలసియున్ననుగొంతన, క్లిలిసహించు
ననుచు నేర్పున నూరార్చి, కొనుచు నమృత వల్లికల్లన వలపుమ, త్రిల్లఁ జేసి
శా. కైదండ గొనియల్ల నల్లనవిరుల్, గాటంబుగా రాలున
పూఁదోటన్నడి చల్వగొజ్జగులగుం, పుల్ పేప రంబైనయ
క్యేదారంబుల గొందిత్రోవ నడుచ, క్కింగప్పు రాల్గప్పుపన్
బ్రోదుల్గట్టగ నాదముగులిమచున్ బూబోణి మెల్మెల్లనన్. ౨౦౪
క. చల్లనిమాటల మదిరం, జిల్లం జేయంగ పొలపుఁ జెఱుకుల డెందం
బల్లలనాఁడఁగఁ దడఁబడు, పల్లవపాణిం బిగింగఁ, బట్టుచు నంతన్. ౨౦౫
ఉ. వేసలియాడి పెన్నెరులు, వీఁలిపిఱుంమునఁ దొట్రిలంగ లేఁ
గౌనసియాడ నూరువుల, గంపముతీగెల మూఁగఁ జేయునె
మ్మేసి సెకన్ సుడింబడుచుమే, న్మెఱుఁదూలుచుఁ దేంట్లువార్చన
మ్మానిని మానస బ్జలస, మానసమానసుఖాబ్ధి మానసై. ౨౦౬

క. తీవియ బెనఁగొను క్రొవ్విరి తీవియబలె నలపుసాలఁపు, దివురుటఁ జెలికై
జేవెనుచు కొనుచుజల్లని, త్రోవఁ సైదోడుగనఁగఁ, దొడరెను తమిఁ తోఁ.

మ. చనిగోజ్జంగుల మంచుజిందనిరిసె, జక్కదమ్మిలే తూడులో
య్యనబోటుల్మమునొత్తనొత్తి, గిలిచి, క్రాంతస్థుఁ బ్రాణేసుపై
సనిమేషస్థితిఁ జూపునాఁటిమరుస, య్యాటంబులం జొక్కున
వ్వనితారత్నము దేవవల్లి గనియెం, వాలారు క్రొంజూపులన్. ౨౦౭

మ. కనిభావంబొకి యింతకందుననిచ, కన్నిక్కి పూబోంట్లసం
దునసందండిల కించఁజిత్ర పటమెం, తోమోహ పున్మమ్మరం
బున నెమ్మోమునఁ జేర్చుఁగౌఁగిటనిడు, న్మద్దాడులేఁ జెక్కులన్
దనివోనొత్తి కనుంగొనుంబులకితో, దాత్తాను షంగంబునన్. ౨౦౮

సీ. ప్రాణవల్లభ! నీకు, బటువుబిల్లలటంచుఁ, బాలిండ్లపై నొత్తి, పట్టఁజూచు
నంతలోఁ బరితాప, మాకునోయని లేచి జిలుగుపయ్యెదఁ గేలఁ, జేర్చి విసరు
గాలిసోఁకులనడ, గ్గిమ్మనోయనిమోవి, పానకమ్మిడిముద్దు, లానుతమిని
బైకోమి కినుకగా, భావించి యెదఁజేర్చి యింపులూరంగఁ బ్రార్థింపఁజూచు

తే.గీ. వలపుతమి రేచిపటముపై, వరునిజూచి, నిశ్చయభ్రాంతిముకులొంది, నెనరుజెంది
తెలిసిఁగన లేమిఁజింతిల్లి, దేవవల్లి వెతఁగలంగుటఁ దెలసియ, వ్వేలఁదిగలసి.

తే. గీ. కొంతయూరార్చె దనటంచుఁ గొమ్మనెమ్మనంబుమురటెల్ల నొంటిశిక్షంబు
బాటి
మోహవాగాశిలోమున్గ, ముగుదయెడకు సన్నఁజనిచిత్రపటముకేల్, జాచిపట్టె.

సీ. పొరలిపోరెదుమోహ, పూరంబులోఁజిక్కి, వెడలఁజాలనిమేని, బడలికలకు
జలువలీనెకుకమ్మ, జిలుగు తెమ్మెరదిమ్మ, లతుంసుకొనుమో, సాలవడికి
మచ్చరించుచువచ్చి, నెచ్చెలుల్దమలోన గుజగుజల్సేయున, గ్గజిబిజులకు
నెడసేసి వలపుటా, త్తతముతోఁ జెడరుడెం డములోని భావంపు, దహతహ
లకు

తే. గీ. లేమియుసుమంత సైరింప, లేకమొదుగు తలిరుఁబోణీలునఁ దనుజూచు, తే
మిని నమ్మృత
వల్లిగసుబెంచుటయుఁ దన, యుల్లమూమ్మె, కెంపుక పడుటయు సిగ్గుపెఁ, గ్రాల
మెఁలెరెపెఁ. [illegible]

క. బాలాపసిపాపవు నీకీలాటి తలంపుబోడము, లేలా? మదిన్
జాలికిఁ దల్లడమందితిఁ గాలుంజాలు న్వీరాళి, సైరింపుమికన్. ౨౧౩

తే.గీ. అనుచుఁ జెలియలిత్రోనించు, కంత తెలివి గొలుపు జలిబిలిపలుకు మక్కు-
పలుగులుక
బలుకు నుడిలోనఁ గేల్దమ్మి, తళుకులీను ప్రాణవల్లభు ప్రతికృతి, పటము
గాంచి. ౨౧౪

సీ. తరుణార్క బింబసుం, దరచకచ్చకలీను నెమ్మోననిమ్మైన, నిగ్గువాని
జిగిదువెన్నెలపహాయల్, జిలుకుశేరానీటు, చిరునవ్వు నెమ్మోము, చెలువు
వాని
దగటుబంగరు తల్పు, తళుకుదేఱువెడంద యురముపై రతనంపు, సరులవాని
సొగకన్నులసొంపు, జాగిమీనులరత్న కుండలప్రభలులో, గొనెడివాని

తే.గీ. నిడుదకేల్దోయి వానిబై, న్నెరులసాటి తేటిగమి దూటు పోనిన, త్రైలవ
తనదు
కూర్మిధనమెల్లఁజూరఁగా, గొన్నవాని గనియెఁ మనసార గిరిశ, నందనునిఘనుని.

చ. కనుగొన హావభావగుణ, కల్పనలన్నన మానసంబునన్
పెనగెడు తత్ప్రకాశమయ, పేశలరూపమె కానలోవెలిం
దనివిసనంగఁ బ్రాణవిభుఁ దత్పరతన్ గనిశుద్ధ సాత్వికో
పనతమనస్క మైయమృత, వల్లిమృదూక్తుః దేవవల్లితోన్. ౨౧౬

ఉ. తరుణిరో! నామనోధనము, దక్కఁగొనన్నశి శేఖరాత్మజుం
డరయనటంచు నుంటినక, టా! పసి పాపవు నిన్వియోగజ
జ్వరపరితాప వేదనల, పాలొనరించెని కేమిసేతునే
త్తెఱఁగును జెందువారమొకో, దేః జగదేకధనుష్క కౌఁగిటన్. ౨౧౭

ఉ. పావని కన్నులెత్తి లల, నామణియగ్రిజఁ గాంచిపల్కెనో
దేవి! భవత్కృపాకలిత, దివ్యకటాక్ష నిరీక్షణైకసం
భావితుఁడౌట, నిఖ్ఖువన, మండలి నన్ఘను మంబటందుమెం
దావసుధార ధాత్మజుమ, హామహిమంబు ధృతిఁగలంచెనే. ౨౧౮

శా. ఏమమ్మా! భువనత్రయమ్ములనతం, డీలోకమాలోకమా
చేమాటల్పని యేమిసర్వ వనితా, శ్రీమంబు తద్రూపమే.

భామా రత్నములైన జూపులనిమిరే, పర్ణ జెందన ముల్మాటినన్
సేవింపన్ సెకపొంతి వెన్నెలవలన్, నిచ్చల్గరంగేరుగా. ౧౦౯

క. దేవీ! నీవేమదిసం, భావించితి వనినవలని, పటురూపవయో
లావణ్యము లేమనరస సేవధిబోటులకు నలని! సేవనమొకచా. ౧౧౦

వ. అనియిబ్భంగిం బ్రసంగ వశంబున నిందుధర నందను నంసం బభిన యించుట నిందువదనల కానందం బతిశయిల్లుటం జేసి పరస్ప రోత్తేజ కంబయిన విప్రలాభంబు వేలాసము ల్లంఘన జంఘాలంబగు నంబుధి వడువున నుప్పొంగు నెల్లి నుల్లంఘింప నలవిగాక తల్లడపడి యుల్లంబులు మల్లడిగొన నోల్లంబోవు చుండదవసరంబున నపాస్తరుచి రాలంకారంబును ననిర్దిష్ట పదబంధ మధురంబును సుఖాకర శయ్యా విరహితంబును ననుదాత్త గుణాబంధురంబును నసారవృత్తి సంశోధితంబును నపరిస్ఫుట వ్యంజ నాలోకంబును నసుటపలనగుకవికవితా వితానాను మితంబయ్యును ననర్గళరస ధారాసార ప్రత్యేతు వర్తనంబును చిరంతన రాజశేఖ రోద్భూత కథా విధానంబును ననుచ్చరితదోషాకర ప్రసంగంబును వయస్యాను రంజిత శీతలపహార్ద పరిష్కృతంబును నతిశయిత లబ్ధవర్ణాంతర మోహనంబును సముచితై కరీతికంబును గావున విద్వద్దాకల్పకల్ప నానల్పంబగు మహా ప్రబంధంబురుం బోలి యయ్యంగనాలలామల యుద్దాము విప్రలంభంబు నిస్సీమంబై ప్రవర్తిల్లె నప్పుడు. ౧౧౧

మ. సకలంతంతటఁ గ్రమ్మి సొమ్మసిలునా, చంద్రాస్యలం గౌఁగిలిం
చికటా! మీాకిది నాయమా? తలఁపుసం,సిద్ధించు నిం తేల తా
వకసం కల్పమసల్ప సిద్ధఫలసం, భారంబు భారంబుగా
దకలం కాత్మత నొందరమ్మ! తగరమ్మా! యింత చింతాప్తికిన్. ౧౧౨

చ. విరహా భరమ్ము లోనణఁచి, వేసరుటో, సరి కార్య యోజనా
దరణము బూని పూనికను, దాత్తఫలక్రమ సిద్ధిఁగాంచునన్
త్తెఱఁ గెఱుఁగంగరాదె జగ, తీరథ నంద నుఁడింకఁ గొంగుబరా.
గరువలె మీాయ ధీనుఁడగు, గావున నేఁటికి నొంపు చింతనల్. ౧౧౩

సీ. పలుకుల చక్కెరలక్కై, పంతగించి పెనఁగు నధరబింబా స్వాద, మందఁగోరు
పాచ మ్రోసలి కీర్ష్య, పట్టమారంకమా స్తనకంజ కుట్మ లో, ద్ధతికి చుబుకు
ఎకవీన కడిమియీా, నడకనె, పకకొను దంత కుందముల త్తో, దారసించు

కచఘనా ఘనముపైఁ, గాఱ్కొంచుగర్జించుమేనివాసనలకై, మిగులఁగసరు
తే. గీ. శారికాకీరకలకంఠ, చక్రవాకహంసభృంగము యూరగం, ధానిలములు
కంటగించవెమిాఱొంటి, నుంటదగదుచాలు,నుపవనిడదయంగ, నేలమనము.
చ. మనములఁ జింతెమానుఁడిక, మానినులార! యటంచు బోటులా
య్యనఁ దనసూర డించు తఱి, నక్కల కంతి సభీవతం సమ
వ్వని తలఁగాంచి యప్పరుష, వర్యుని సన్నిధికేను పోయి చ
య్యనఁ జనుదెంతుఁగా కమన, యర్థము సర్వము సంఘటించెడిన్. ౧౨౫
ఉ. నాయక రత్న మాతనిమ, నంబున నేతదయోగ చింతయే
చాయ ఁబెనంగునో తదను,సన్నిధి వారల గోష్ఠి యెట్టిదో
యీయభిలమ్ము నారసిత్వ, దేకదృఘా శయలీ నెలంతలం
చాయన కాత్మ నెక్కొలిపి, యాదట మిాకడ కేగుదెంచెదన్. ౧౨౬
ఆ. బోటులార!మిారు, పూవింటి దంటచే,మిగుల నొప్పనీక, మించు బోండ్లఁ
జాలనమృతి వల్లి, సౌందర్య వల్లులఁ బ్రాణపదముగాన, బట్టుఁడనిన. ౧౨౭
ఉ. దిగ్గున లేచి పెంఃకులను, దెల్విదిటంబుగ బోటిగాంచిలో
భుగ్గుర టంచు ముందు స్మర, భూజ్వర భూతక్షతాను తాపమున్
సిగ్గును గొంత కొంత కడఁ, జేరిచి పల్కిరి యిట్టి వేళనా
వెగ్గలపుంద యావనధి, వెల్లువ గట్టఁగ నాదరించితే. ౧౨౮
ఉ. కందులె ప్రాణవల్లభుసి, గన్నులు చల్లఁగ మందలించుచున్
డెందము గందునే బలుక, డిందిమ గంటిమి దంటతాల్మియ
స్పందము గాన లోతరసి, యచ్చటి వారల మంతనంబులే
చందమొ?నీతపమ్ము ఫల, శాలిగదా పతిఁజూడఁ గల్గెడిన్. ౧౨౯
క. అన్నియుగనికొని ప్రాణము, లున్నంతనె వచ్చితీర్చు, ముమ్మలికమ్ములే
మన్ననఁ గొనుమని వెన్నుని,కన్నియలిర్వురును లేచి, గారవకలనన్. ౧౩౦
ఉ. చెక్కుల దువ్వికౌఁగిళులఁ, జేరిచికోరిచి రత్నరత్నముల్
చెక్కిన మాక్తికావళులు, చేనిడి కాన్కలొసంగి చెల్వనిన్
మక్కువలూరఁ జేసియను, మాసముదీడిచి మమ్ము నాథుతో
నొక్కటిసేయు భారమున, కోచెలి! నీవనియుంచు మంచనన్. ౧౩౧

క. తల్లీ! నెఱిపకు యువతిమ తల్లీ! మోయమృత వల్లి! తడయను మదిలో
నుల్లసిలు దేవవల్లీ! తల్లడ పడ కేనువత్తుఁ, దప్పరమతినై. ౨౩౨

తే. గీ. అనుచునసిచినశమిలోన, నవ్వధూటియాశ్వరాత్మజు జూడంగ, నేగెననిన,
నవలివృత్తాంతమెట్టిదో,యానతిమ్మటంచుమునికోటిసూతుని,నడుగుటయును.

— ఆశ్వాసాంత పద్యములు. —

మ. కమలా గర్భ విదర్భ రాజ్యరమణీ, గాథాను రాగక్రియా
ప్రమదారంభ విజృంభ జంభదమన, ప్రస్పర్థి సాభోగభో
గమహా మంత్రికులైక భూషవరరా, కాచంద్ర చంద్రప్రభా
భ్రమదప్రస్ఫుట కీర్తిసాధన సమ, గ్రారామ చంద్రాత్మజా. ౨౩౪

క. రంభో రూమదనజయా రంభావహ రాజనయవి, రాజిత వాణీ
పుంభావ కీర్తిగుంభిత కుంభీనస రాజధామ! కుశలవరామా! ౨౩౫

తరళ. నిజము ఖాగ్ర జాగ్రదుక్తి, నిశిత మండలాగ్రభా
వ్రజతతత్త శాంధవైరి, వారసమయ ధోరణీ
విజయ సాహ సాంకవీర, విక్రమార్కయ నలదృ
గ్భజన పరమనోరవింద, బంధు!సింధు సాగరా!. ౨౩౬

గద్య.

ఇది శ్రీసదుభయ భాషారసజ్ఞ రసజ్ఞాగ్ర నృత్యన్నాట కాలంకారగ్ర
న్థాన్యప్రబన్ధ బన్ధుర కవితానిబన్ధన శ్రీమద్వేమ నారాధ్యవంశప
యఃపారావార రాకా సుధాకర (ములుగు) శ్రీపాప
యారాధ్య విరచితంబగు సరసహృదయానురం
జనంబను మహాప్రబన్ధంబు నందు
ద్వితీయా శ్వాసము.



శ్రీశివాయ గురవేనమః.

# సరసహృదయానురంజనము.

## తృతీయాశ్వాసము.



మానిరవహృదయ! కవి,
గ్రామణిసంకల్ప శిల్ప, కల్పక్షితిరుహా! సం
గ్రామ ధనంజయ! గుణగణ,
కోమల దామాభిరామ! కుశలవ రామా! ౧

గీ. అవధరింపుము సూతుఁ, డిట్లనియె మునుల, కంతఁగలకంఠి క్రౌంచారి, యంతికమున
కరుగు నదియాది గాంగమో, హంబురాశిఁ బొరల నడుచక్కిఁ గన్నియ,ల్బొగులు నంత. ౨

—* సాయంసన్ధ్యాకాలాది వర్ణనము. *—

సీ. హరితురంగక్షుణ్ణ, చరమ భూధరదరీ, గైరికక్షోదసం, క్రమణమనఁగఁ
జటుల సంధ్యానట, చ్చంద్రశేఖరజటా, పటలపరిభావళీ, ప్రసరమనఁగ
చైత్రయాత్రాసము, త్సాహసాహసకంతు, రక్తకంకటవిభా, రాగమనఁగ
వరుణశుద్ధాంతసం, వరణాగ్రకురువింద, బాధురారుణరుచి, ప్రచయమనఁగ
గీ. యామినీయామినీవరా, సల్పతల్ప కల్పితాగ్రవితానరాం, కవమనంగ
సాంధ్యరక్తిమ యంతంత, చదలఁ బొదలె ఘుసృణమసృణ ప్రవాహమో, కో యనంగ. ౩

మ. తమమిత్రుండు ద్రిలోకబాంధవుఁడుప, ద్మాకాంత కాణాఁచిరై
తమయింట న్నివసించు జీవనమనం, తంబంచు మత్తాళిసం
క్రమమొందందము దమ్ములంచుఁ గనఁడు, గ్రగ్రాంశుఁడౌ రాజువ
ర్ఛేచు ప్రాజ్జల్యము లేదటన్నగతిరా, జీవాళి గృంగెండమిఁకా. ౪

చ. ఉదయము నొంది సత్పథము, నూని కరగ్రహణాప్తిఁ బద్మినిన్
వదలక స్వేష్టకృత్యముల, వశ్యతి సద్ద్విజ చక్రిమేలుచున్
విదిత మహావనమ్ముఁ గని, వేఁడుక సంస్కృతి శోభకావియై
ప్పిదముగఁ గప్పెనోయనఁగఁ, బేర్మిఁ దగెన్ రవి రోహితచ్ఛవిన్. ౫
మ. హరిదాసాటము నాత్మ పుత్త్రికలయో, గావస్థలం జెంది దు
ర్భరచిత్తవ్యథలం గలంగుటయుఁ ద, త్ప్రాణేశుఁ డోతెత్తునం
చరిగెం బోయన నర్కుఁడే గెనటులే, గాకంటె దాక్షాయణీ
పరమోత్సాహముతో గుహాద్భుత తమ, స్స్వానంద ముప్పొంగెడిన్. ౬
మ. పరభూభృత్కటకంబులం దనసఖుం, బాల్వెట్టి వీరారిపుం
జరణోల్లాసము లేర్చుచుండ ననలా, శాపాళులన్ శోణని
ర్ఝరిణీవారము గొల్లఁగాఁ బఱపి సాం, ద్రశ్రీ విరాళించి భా
స్కరుఁడేగెన్ భువనాంతరంబునకు లో, కంబంధమై లోఁగఁగన్.
మ. సమయానేకపముం బరాటవి దురీక్ష్యంబౌచు గంధాఢ్యసం
భ్రమవృత్తిన్ దిననామశాఖిఁ బెకలిం, పన్ దిక్కులన్ వ్రాలు త
త్సుమముల్ దారలు తత్ఫలంబు రవినాఁ, దోఁచెడ దుర్వ్యోజను
ద్భ్రమదిందిందిర బృందమోయనని రు, ల్బ్రాకెన్ను భోమండలిన్. ౮
క. ఇందీవర శాలలలో, నిందిర చూత్నప్రవేశ, మొనయుటనో యిం
దిందిరరవపుణ్యాహపు, గ్రందున నంతంత ద్విజుల, కలకల మొనసెన్. ౯
మ. శతపత్త్రీక సహాయతన్ మధుపముల్, ఝంకార వాచాటను
ష్పృతిభిన్ పాంథసతీజనంబుఁ జెఱలం, బాల్వెట్టి సర్వంబును
ద్ధతి మీఱన్ సుమనో మరంద ధనముం, దంజూఱఁగాఁ గొన్న దు
ష్టచరుల్ బంది ఘటిల్లెనన్ గతిఁ బద్మో, జస్థాయులై మ్రాన్పడెన్. ౧౦
క. హరిపదహాసిత్రయాతనుఁ, డరయఁగ వారుణికి మరిఁగె, నర్కుండనుచున్
సరసులు కన్నులు మూసిన, కరణిఁగ నలినములు మొగిచెఁ, గాసారముల్.

—* చంద్రోదయాది వర్ణనము. *—

సీ. కలిమి పూఁబోఁడికిఁ, గారాబుసైదోడు, కలలేని మూఁకకుఁ, గటికిదిక్కు,
కడలికా ముమ్మికం, బెడతీపి పుణ్యంబు, సంతమ సాభ్రజం, ఝూమపుత్త్రు,

కలువల వికసిల్లఁ, గాఁడేయు నెచ్చెలి, తమ్మిపూవుంబోండ్ల, తరుపుకాఁపు
తనివోని చలువముం, దసములవిడిమట్టు, గట్టుఁవిల్తుఁడుతీపు, సట్టిసొమ్ము
గీ. జక్కవల మేలి చెలికాని, సంగడీఁడు, చుక్కవాల్గంటులకుఁదమిఁ, జొక్కమం
దుపొడుపుగుబ్బలినడుచక్కి, పొలిచినిక్కి. చంద్రుఁ డరుదెంచె వెన్నెల,చదల
నించె. ౧౨

ఉ. ఉదయధరా ధరోర్ధ్వతటి, నొయ్యనఁ జంద్ర మృగేంద్ర మెక్కియు
భ్యుదిత మరీచికల్ సటల, రోజవిదిర్చి మెఱర్చునంతలో
నొదిగిగు హాజ్జొరం బడియె, నోయనన న్యెడ కయ్యెడఁ దమో
మదకల ముల్లసంబడక, మాయఁగఁ బాయఁగఁ జొచ్చె నచ్చుగన్. ౧౩
శా. జీవంజీవ మిథస్స మాగమ సమా, శ్లేషోత్థ ఘర్మాంబునే
త్రావిర్భూత ముదశ్రుధారలన, నీ, హారంబు తోరంబుసం
భావింపం దగియెన్ దదుత్సవసుధా, భవ్యాన్న సత్రంబులో
నావన్నె ల్వచరించి వెన్నెలలు స, న్మానించె విన్నాణమై. ౧౪
మ. శతపత్రారి శతాంగసంగత మహా, సత్త్వాశ్వ కోటీసము
ద్ధత దూరాంబర మార్గచంక్రమణదీ, ర్ఘాయాస వైధుర్యని
స్సృతలాలాన వఫేనఖండములనం, జెల్వొందె సాంద్రీభవ
త్తత చంద్రాతపముల్ చకోరపటలో, ద్యద్ధస్మ సత్రంబులై. ౧౫
సీ. పటుకటీతటపరి, స్ఫుటదుకూలప్రభా చాకచక్యములతోఁ, సరిపెనంగి
స్ఫుటపయోధరతటీ, సుకుచిముక్తాగుచ్ఛ గుచ్ఛార్ధ తళతళ, ల్గూడియాడి
కబరీపరీణద్ధ, గన్ధగన్ధిలమల్లి కాస్రక్స్వరంపర, ల్గలసిమెలసి
కర్పూరధూళికా, ఘటిత పాటీరాంక పంక, లేపములలోఁ, బరిణమించి
గీ. సంసరణభీత లగునభి, సారికలకు, స్వస్వరూపాను సంధాన, సామరస్య
నిశ్చయముఁ దెల్పి తరియించు, నేర్పుఁ గొలిపి కౌముదిచెలంగె నద్వైత, కౌము
ది యన. ౧౬

సీ. గగనగంగాతరం, గమిథస్స ముద్ఘృష్ట, పరిపత త్ఫేనాత్మ్మికి, కరములనఁగ
సాగరాంతర్నిమ, జ్జన్నిర్గతాబ్జారి, రథవాజివాలవా, ర్జాలమనఁగ
యామినీచంద్రమః, కామోపభోగసం, ఘట్టనోద్భూతాంగ, ఘర్మమనఁగ
నభ్రభ్రాటనీప్రాంగ, ణాభ్రమద్దుర్ధర్ష సమయసామజ మదా, సారమనఁగ

య్యాదుముఖుల్ విరాళిసెవ, మెత్తి జగమ్ముల చంద్రచంద్రికా
మ దడవార్చు లంగలచి, మ్రగ్గు నెకోయని లోఁదలంకుచున్
గుందుచు నించుకంతయును, గోల్కొనసీ నివిషాద వేదనన్. ౭౩

ఉ. అంగజరాజ గామినుల, నంగశరవ్యథి తాఁతరంగలై
మేగతినాగ రాసిమను, లెత్తి సఖుల్వ్రీల పిఁచఁదారునన్
రాగరసోత్త రంగముఖ, రంగకలధ్వనిఁ బూర్వరాగపు
న్నాగవరాళి కాలలిత, నాదసుధారస పూరమూరఁగన్. ౭౪

గీ. వలఁపుఁడలఁపులు వలనంత, గొలుపవిరుల తల్పములుదావ దహనమైన, కల్పములుగ
నిలువఁజాలక విలపించి, తలఁచితలఁచి, వెతఁగలఁగి తరుగిరు, ల్వెచ్చనూర్చి.

ఉ. తత్తరమంది నెచ్చెలులు, దగ్గరఁ గౌఁగిలించి వెమల్చుచున్
బిత్తరులార! మీకిటుల, జేలతనంబులఁ దూలనేల? మీ
చిత్తములింక రంజిలున, శేషశుభంబులు గూడివచ్చెదే
హోత్తముఁడైన యగ్గృహుని, యొద్దికతోఁ గుత సంఘటిల్లెడున్. ౭౬

వ. అని. ౭౭

ఉ. ఊరడిలంగ నాఁడిపున, మూరకయున్నను మంటమీరియా
వారిజవైరి యుట్టిపసి బాలికలన్ బెగడొందఁ జేయుకీ
రారవకోకిలధ్వనుల, యూంకరుసాంకుల పాటుఁ జెందుచోఁ
దోరఁపు వెన్నెలగ్గవసి, త్రోడయినాగడ మల్లలుంగునే. ౭౮

చ. మలయసమీర మాత్రికుఁడు, మత్తమధువ్రత నాదమంత్రముల్
బలుకుచుఁ గల్వపుష్పాకుల, భస్మముఁజల్లుచు పీఁడనచ్చెనో
జలరుహ నేత్రలార! పెను, సదకిఁగొల్పుఁడు పూచిపట్టియా
యలరుల కోనకై నఁజన, సాఁగద శేష్మెల దూరదేమియర్. ౭౯

క. లలనలు మైమఱచినలలి గలదే? యెలనాగలార! కాదద, నాఁడా
కలకంఠియుఁ జనితడయుట నెలతల యలమటలు దెలియ, నేరమియయ్యెన్.

ఉ. వంతము లేల? మీఁదభగ, వంతుఁడు శ్రీహరి మేలుఁగూర్చినాఁ
డింతకు నింతులన్నిగులఁ, నేపఁగ నేపఁగ నిందుఁడొందెనో
కంతుని శాతకుంతముల, కోఁపడి మోవడిఁ దూలపుచ్చెని

శ్యాంతలు సౌమ్యసిల్లిఁక, కందువమాటల నిందుసందమే. 3౨

గీ. అనుచుననుచుముదమ్మున, నన్నుమిన్న లెల్లమెడలనుదొవటోంట్ల, నల్లమలర
నవ్యచంద్రాత పాచ్ఛాద, నములలోనె పెనఁగిగిలగింత లాడుగా, బిల్లినసిరి.

—* చంద్రి వందనము. *—

సీ. భువనజాలములెల్ల, బొజ్జలోఁగలమేటి శిరసావహించెనీ, చిన్నినాఁడె
యిసుమంతకనుసన్న, విసరుచేఁగలుము లీనెడుబోటి,తోఁబుట్టి, నెసరుగుల్కొ
జనభయంకరతమం, బునణంచి సర్వార్థ విజ్ఞానివైతివ, భేద్యగరిమ
నోమధీపరిపాల, నోన్నిద్రశక్తిచే నమృతప్రకాశివై, యలరితీవు
గీ. కళలకెల్లను నెలవుని, స్వసచంద్ర!యాసఁగొంటిమి గానవా, స్లోదమొసఁగి
చల్లఁజేయుము మాబోటు, లుల్లసిల్ల "నావమన్యత యోషితాః" యనుట
వినవె. 33

ఆ. బహుసహస్రపత్ర, భాసమానుండగు, తపనుగొండలంట, దగినట్టి
రాజవింతెకాదు, రాజశేఖరశిఖా మణివిరాజముఖుల, మనుపవయ్య. 3౪

ఉ. వేలుపుమూఁకలెల్లనిను, వేఁడిభుజింపక పొట్టనిండదిం
తేల?జగన్మయుండగుర, మేశునకుం బరమాంత రంగివా
ఘాలవిలోచనుండు నిను, బాయకతాశిర సావహించెనీ
శీలవుశుద్ధ సత్త్వముప్పి, సిద్ధుఁడవన్నిట నేణలాంఛనా! 3౫

చ హరిణముగేలఁ బూనిధవ, శాంగముదాల్చిక శాధవుఁడవై
భరితదిగంతు కత్వమున, భాసిలిదక్షసుతామనోహర
స్ఫురణముబూని మామవలె, శోభిలినాఁడవు చందమామ! యా
తరుణుల నీదయామయసు, ధారసధారలఁ జూఱఁగొల్పవే. 3౬

క. నినుజూఁచిన ప్రాల్గరఁగును నినుఁగన్నది కన్నుగాఁగ, నిఖిలముఁబొగడఁగ
మనదువినమాత్ర భావం, బనినమ్మిన చెలులఁగరుణ, మన్నించుశశీ. 3౭

సీ. చంద్రికావిచరిష్ణు, తాసాహంబునీయది కువలయానందంబు, కూర్మినెలవు
నవ్యచంద్రాలోక సంబన్న, జగమెచ్చు లగుకళాపూర్ణోద, యంబుడంబు
పటురసోల్లాసంబు, భవదనీనంబుగా, సదసద్వివేకంబు, సహజగుణము
సుధనీకు నిండారు, సుమనోమనోరంజ, నంబునీహృదయాను రంజనంబు

గీ. శానసర్వజ్ఞశేఖర, ఖ్యాతిఁదనరి పూర్ణతేజంబుఁ గాంచుస, త్పురుషవర్య!
మాచకోరాక్షులనుఁ గాచి, మనుపవయ్య చల్లని సుధారసంబుఁ బైఁ, జల్లవయ్య. ౩౮

క. అనియను కూలాలాపము, లనుశేరా బొగడికొనుచు లాలించినభు
గ్గనియన లజ్వాలలలోఁ దనివోనే వోసినట్లు, తరుణులుగినుకన్. ౩౯

క. చుఱుకుంజూపులఁ జెలులన్, జుఱజుఱనైఁ జూడఁగినుక, సోముగ మెదలో
నెఱుకపడ బొంట్లుపో! నై, మఱిదిలిమని యాడఁజంద, మామకునెమరై.

—* చంద్ర నిందనము. *—

మ. నినునిందింపఁ బనేమి? పాలకడలిన్, నీసృష్టిఁ గావించుచో
ఘనభంగాకుల తృప్తిఁగూర్చె విధియా, గా" యంపు రస్కృత్యయో "
యనుశాస్త్రీయ విరోధమేల తెలియం, డన్యోన్ జగన్నింద్యమా
పనిసేయుందల వోయుచోట నుచిత, వ్యాపార మెల్లాశశీ. ౪౧

సీ. శైశవంబునిన్ను, జదివించుచోఁ జేయు దుడుకులోఁదనెగురు, ద్రోహ మమరె
సమధికాభ్యుదయాన, సరసింధుభంగసం, ఘుటణంబునఁ బిత్రు, ద్రోహమలరె
నెమరెఱుఁగకనీశ్వ, రేనుసాదలవీఁద, దూకుటదేవతా, ద్రోహమయ్యె
విరహిణీసంతాప కరకరోల్లసనాప్తి, దొఁడరుట స్త్రీవధ, ద్రోహమయ్యె
గీ. నొకటరెంటుమూట, నొసరంగ నాల్గిట, ద్రోహివనుచునలువ, సాహసించి
నడిమహాబిలమునఁ, బడఁద్రోసె నిటులయ్యు, మానరాదెనరభి మానచింతఁ.

మ. సరసుల్లద్గురు కామినీకుచతటీ సంశ్లేషసంజాతను
స్తర పంకంబుర మంతెనందు రదియే, ధర్మంబా? సర్వాంగసం
కరమూలాఘము గల్గిరోహిణి గదుం, గామించు చోనన్యస
త్సరసీజాక్షులు మెత్తినంగమలిమాం, స్రగ్రంథి యయ్యోజుమీ. ౪౩

ఉ. కొండలనుండి వచ్చెదవు, కొండలఁజేరెద వింతెకాదునీ
దండఁజకోర పుంబులుగు, తండములాడెడు చెంచుబోయయ
ట్లుండెడుఁగానఁ బాంథమృగ, యూథము బెగ్గిలఁ జేయకుంమువే
మండెడు చంద్రికానలము, మందగతిన్ దరికొల్పి సిట్చరా. ౪౪

గీ. సహజవైరంబుకృష్ణప, క్షమునకీవుఁ, గూడదామీఁదఁ గువలయాపీడవృత్తి
కృష్ణపక్షంబు కేశిరెచి, నెరసెమునుపు కువలయాపీడ మెట్లెగిమే, లోఁను

ము చంద్రా! ౪౫

శా. సర్వోత్పత్తి తమోనిరాకరణన, త్సాంగత్య ముల్లీవహన
స్సత్వంబుల్ ద్విజరాజ నామములకుం, ధర్మంబు లౌ నారుణీ
స్పర్శంబు త్పలలోలు పత్వమునునై, జంబౌట రాత్రించరే
శత్వంబొక్కఁడు దోచుచున్నయది, నక్షత్రేశ! నీ కింతయున్. ౪౬

సీ. ఘనపురంపకలల్చోఁ, గన రాసనీ కెట్లు ద్విజరాజనామంబు, తేజరిల్లె
దినదినక్షయముచే, డగనశించెదునీకు, బైవాతృ కత్వమే, దేవుఁడిచ్చె
తమ్ములమీఁదఁబా, దమ్ములెత్తెదునీకు, సత్పురుషత్వమే, చాయనలరె
దోషాకరత్వంబు, దొలఁగజాలనినీకు విషపదావాప్తి, యెవ్విధిఘటించె

గీ. కరగతంబైన నీదుశం, బరవిలాస మదియొమారీచ నీచచ, ర్యాతిశయము
పొందియావిద్య, యొందభ్యసించినావొ, తేనెఁబూసిన కత్తివై, తివిమృగాంక

చ. హరిహరు లిద్దఱుం గలసి, యబ్ధిమధించెడి వేళ వేఁడినన్
సరసిజగంధి భార్గవిని, స్వర్ణపటిన్ హరికిచ్చి నిన్నుగిన్
గరళము శ్రీశివార్పణము, గానొనరించినఁ బట్టిమిగుటన్
శిరమున కెక్కితీవు మెడఁ, జిక్కెవిషంబికఁ జెప్ప నేటికిన్. ౪౮

సీ. విశదప్రభారాజ, విఖ్యాతిచేనిన్ను పాండురాజవటంచుఁ, బలుకరాదె
కడిమిమీరననంత, గహనంబులో మృగోత్సాహివై పాహ్యాళి, జరుపలేదె
యాత్మజాభ్యుదయంబు, నందిసర్వాశాభితృప్తి గావసువృష్టిఁ, దేల్చలేదె
యాత్మకాంతానుగ్ర, హంబుఁదత్సారస్య ఘటనంబుచేమాకుఁ, గానవయ్యె

గీ. నింతలింతలు వ్రక్కల, య్యెదవుగాని, సుఖనివాసంబు లభియించు, చొప్పులేదు
మానినీమాన మథనని, ర్మాణమునకు, నభినవబ్రహ్మవైతివో, యంబుజారి.

గీ. చక్రవహృద్భేదనోద్భూత, చటులకీల్చిష మ్మునినుబండిగాఁజేసి, యొమ్మగండిఁ
జేసెనింతియె కానిపోఁ, జేయదయ్యె నంగనాద్రోహ మటువంటి, దనకుచంద్ర

క. అనిచంద్రో పాలంభన, జనితోత్సాహమునఁబట్టు, సడలని తాపం
బున ననలము దరికొలిపెను ననిలకిశోరములననిరి, యారసికినుల్. ౫౧

— * మలయానిల తిరస్కారము * —

క. మలయాచల నిలయానిల, తలయాపద లాగలంచఁ, దగవాగవా
జ్వాలదినల జ్వాలలుపైఁ, జిలికెద వీగుణమునీకు, స్నేహాగతమో. ౫౨

క. అనలానిల షడ్జములలో, ననిభేదమె [illegible]

కదలఁగనీయఁగఁ గాల్పననలము గదరా కనె కాల్చవె న, కన్నెఱ పవనా. ౫౩

చ. పుడమి వడంకఁ జేయు బలు, భూతమ నీవు చతుర్దశస్థలిం జే
విడిబడి చంచలత్వమున, పెక్కుచుఁ గంటిఁ గానరాక నే
మొదలికి నాసుగత్వమున, నోర్వఁగ రాని భరమ్ముఁ జూపు నీ
నడవడిఁ జూచి మంద పవనా! తలవంతుసుగా మహాత్ములన్. ౫౪

క. నీ రూపము వివరింపఁగ, నీ రూపము ఘనులకైనఁ, జయమితకన్మ
ప్రారంభుండవు కుశలా, చారా! నీమాతెశ్వ, సహజమెటులనో. ౫౫

ఉ. వచ్చితి వీవటన్నఁ దల, వంపులు కొమ్మల కెల్లలోకమం
దెచ్చటనైనఁ బుష్పిణుల, నీడిచి పుష్పరసంబు చల్లఁగా
వచ్చునె యీయ మానవపు, వర్తన లెల్లను కట్లపాలుగా
మచ్చిక లింకఁ జాలు పవ, మాన! తొలంగు కృతాంత మార్గముల్. ౫౬

ఉ. నీపొడఁగన్న భీతివడి, నిందుడు వాయువు వచ్చెనంచు మే
లీవలు మాటలెల్లనని, యేపుడుఁ బట్టఁగ గాని నిల్వరా
దేపశకైన నీమెదుర, నిష్టముగన్ సుమనో పరాభిమే
మోపము నీమధు ప్రతిభ, కోర్చ మనంతుఁడు గల్గు మాకికన్, ౫౭

చ. నడవడి లేమి నవ్వదుర, నక్క సమయా సమయంబు లెంచక
న్లైపలను సంచరింతువడి, యెట్లని యేకుల పాటునాడెనొ
వెడలిన సౌమనస్యమును, పెంచుగదా? ఫలపాతనంబులే
కుడుగదు గదా? కుజాతినిల, యుండవు మంద సమీర! రాకికన్. ౫౮

క. పాటీర గిరితటీవన, వాటీ పాటచ్చరుఁడవు, బాధింతువు ని
న్నాటీకత మృగమదసం, ఘాటాంజన భస్త్రికలంబ, భంజన! యెట్లో. ౫౯

చ. అని మలయాద్రి కంధరచ, రానిలుఁ బాష్పమునోద పానలున్
గినిసి నిశాత పంచశర, కీలిశిఖాముఖ మాల్యబాణుర
జానుపఁగ శంబరాసుకులి, ఘూదనుఘాతకు నాగలేక నె
మ్మనముఁ గూలు బాలికలు, మచ్చిక నెచ్చెలులాగి మాగుచున్. ౬౦

—* చంద్రోపాలంభము. *—

క. అభ్రాత్రి ధీరచకోరాపళి, కో వెన్నెలలఁ బ్రోగిలి, పసుతో గలహాలా

హాళికో మదనానలకం దళికో, తలఁ కెదరుచెలులు, దరియం కేళ్లో. ౬౧

క. చిలుకలతోఁ జలువలనె, న్నెలనెలతో మిగులవలదు, నెఱచలిమిత్రో
నలికులముల గలిబిలితో, పలదీక మచ్చరముమకుకు, వలరాజిచటన్. ౬౨

క. కందవు డెందములందరి, మిందుముఖు ల్మదనునిందు, నెగ్గించిననే
మందురో యందనుగందుహో, విందురో పొందికగననుచు, వెడవిల్తునితోన్. ౬౩

సీ. గంటఁగట్టినవింటి, కాఁడనంచనకుమీ, తుంటవింటికినేమి, దొడ్డతనము
సహకార పటుసైన్య, సంచారిననకుమీ, రాలుగాయఁపిట్ట, లేలపొగడ
సుమనోను గుణగుణో, త్సుకుఁడ నంచనకుమీ, చండాలు రనునింత, చాటఁ
దగదు
రాజాశ్ర యోద్ధత, ర్పమున మైపఱకుమీ, సత్కాంతి శూన్యుఁడాచక్రవైరి

శా. యిట్టిసాహాయ్యమునజయం, బెట్లుగలుఁగు, ధర్మబలగుణసత్సంగ, దార్ఢ్యమెద్ది?
కానసీకనైసఁ జెలులపైఁ, గనరుమాను మేలయబలలనొంచంగ, నిటులనంగ.

సీ. మధువిరోధమునవె, మ్మదినూనెనీతండ్రి మధుసహాయమునసాం, పలరితీవు
పంచాయుధుఁడనంచుఁ, బలికెనీతండ్రి, నేపంచాయుధుఁడనంచుఁ, బలికితీవు
కమలాంబకుఁడనంచు, గర్వించునీతండ్రి, కమలాంబకుఁడనంచు, గనరితీవు
ఖగరాజవాహంబుఁ, గట్టిం చెనీతండ్రి, ఖగరాజవాహంబుఁ గట్టితీవు

గీ. తండ్రితోఁ బోర నాత్మజుఁ, డండ్రెవాని, నీదునుత్పత్తి మనములో, నిఖిలమె
ఱుఁగు
ప్రథమపూజ్యుండుధ్వజమెత్తఁ, బాడియగునె, జనకుతోఁబోరు తగదోరి, శం
బరారి. ౬౫

క. సుదతుల గదుముటచేగద, మదనా! నీసుమశరత్వ, మాస్యతకయయో
కరసెండు శబ్దపూర్వత, యొదవున్ యశ మపయశంబు, నుర్విగుణతతీన్. ౬౬

క. కన్నులుగల విల్లనియా, యన్నులవేచుటకునీకు, నదనామదనా!
వెన్నునకొాళ సరికన్నులు, కన్నులువిల్నడికినేలఁ, గలపుంజుమ్మా. ౬౭

సీ. పాంథమర్దనవృత్తి, పరిణతంబాచునీ, విక్రమాక్రమణంబు, వినుతికెక్కె
రతిలోలుపతన హెహా, రాత్రవర్తనలచే, మధురథరాంచార, మహిమనెగడె
కామినీ మానభం, గఁపుఁగాఁపు రమ్ముచే సత్పూజ్య రాజ్యసం, శ్రయము
మెఱసె

విరహిణీగర్వాప, హరణకౌశలముచే, ససమబాణోల్లాస, మతిశయించె
గీ. త్రిజగదభినంద్యగుణసము, ద్రేకమెల్ల పదటిపాల్జేసియింతగా, బ్రబలినాపు
మోక్షకామాఖభుక్తని, ర్ముక్తపత్రభాజనంబీమనఁగనొం, పకుమనంగ ౧౮
క. వలరాజనుటకుఁ జేపల వలరాజవొపడగఁబడఁగ, వలెబేడసయా
వలరాజులు సర్వాంగఁగే వలరాజసవృత్తి నెఱుఁగ, వాభావభవా. ౧౯
మ. సహజామిత్రుఁడు చంద్రుఁడాచదరము, ల్జాటంగముఖ్యాంచుమీ
సహజామిత్రతకీ యెడక్ గనుపడక్, సత్సాంప్రదాయాగతం
బహహ! నీకిని మేనమామగుణపూ, గాలేదదేసత్పథ
స్పృహయాపీఠమునందునల్లగొనుగో, పీడాబువ ల్గాలునే. ౨౦
శా. స్వామిద్రోహము సంభవించెఁగుసుమా, స్త్రా! నీకుఁ గ్రొంచారియు
ద్దామప్రాభవుఁడింపుకంతకసరె, త్తంగొండలూటాప్పనీ
రామా గత్నములన్ముహామహులనకుఁ, బ్రాణమ్ములక్లాటచేఁ
బూములుఁబల్కునికాల్చి తుంటవిలుతు, ప్పల్డుల్చిఖండిచెడిక్. ౨౧
క. ఇత్తెఱఁగున మరునురులున, జొత్తిలుచిత్తములయాలప్పు, సొగయక్ వలరా
నొత్తిపలికిచెలికత్తియ, లత్తటిస దీవివలపు, టలమటఁగనుచుక్. ౨౨

—* వపూపరిచారికలు కలఁత నొందుట *—

కం. వలరాజుం జెడనాడిరి, మలరాజు, జెకువునుపువ్రు, టంపటనొంపక్
దలఁచి కలంచితి మబ్బలల, వలపుదల కగ్గించి, వనటమ్ముంచెక్. ౨౩
మ. కలకంఠీ కలకంఠ పంచమరుపూ, కారంబు ఘోరంబుగా
గలదిందిందిర సుందరీదటూర్ఝూ, కారంబు కారంబుగా
బలవింపన్నల విప్రు గాళ ననలా, ల్పాఘఃపరా భూతపూ
నలినీయుగ్మము బోలిసొలి దపిఱుం, చక్ సాగిరిం కెల్లాకో. ౨౪
సీ. తుహినదీధితియరుం, తుపకిరప్రసవారణ, ప్రహారణమ్ముల కెంత, బడలిరమ్మ
మలయభూధరదరీ, నిలయూనిలానల, స్ఫుటతరార్చుల కెంత, పొగిలిరమ్మ
మకరందరసఝరీ, మహితోన్మికానవీ, షేల్లసంబుల కెంత, విసివిరమ్మ
కుందబృందాసవా, నందతుందిలభృంగ, సంగీతముల కెంత, జ కిరమ్మ

గీ. వలపువలదింక వలరాజు, వాడకట్టు, గానియుపవని గామవా, ల్గటుగార!
అబలలను నిండుకౌఁగిళ్ల, నదిమిపట్టి. కదలుఁడిప్పాళె మనవసతి, సదనమునకు,

ఉ. బాడొ మలిట్లు పల్కుచుమ, హరోజ్జ్వలరత్నము, రీచివీచికా
మండల మండితాభ్రమణి, మండనమైన మణిప్రహంబులో
నండజ తూలికా కలిత, హంమృదు తల్పముఁ గూర్చిబోటులం
డొండ సఖీవతా సముల, నుంచిరి కౌఁగిళులందె మచ్చునన్. ౭౬

ఉ. కొండలనేలు గబ్బిచను, గుత్తపుగుబ్బల యబ్బనుస్థరా
మండలమేలఁ జాలుగరి, మంబుఁ గొన్నకటీ తటంబులున్
నిండుదనంబు పీడకయ, నెయ్యపుఁ గత్తెల సందిదండలన్
బొడుబువోలె నుండిరతి, భీకరకాంతల కార్శ్యమేమనన్. ౭౭

చ. వరమణి మంది రాంతరధి, వాసిత కుడ్యత లాత్మబింబవి
స్ఫురణ మనంత మైకపుర, సూవన నందను జెందఁ గోను త
త్తరుణులు పెక్కు జన్మములు దాల్చి తపింతుర నాగ దుష్కర
స్మరశర పంచక జ్వలన, మధ్యమునన్ బొరంగ నంతటన్. ౭౮

చ. వలపు దలంపు లూరెంచె, వల్లభు నుల్లము గంను నాచునా
సలఁగల కంతి యందఱఁగి, చాలగ దూదడ వయ్యె రాకయ
వ్వల దొర భారిఁ ద్రోఁచి మన, వంత యొకింత దలంప దిట్టిరే
యుల జడికొట్టు బోర్తుమక, యకటా! వికటంబుఁ జెల్లునే? ౭౯

ఉ. నెచ్చెలి ప్రాణవల్లభుని, నిందు ముదంబున గాంచి మచ్చికన్
ముచ్చట సల్పెనో మనము, మోహము గొల్పిక రుచిగఁ జేసెనో
మెచ్చియతాను గూర్మితమి, మేకొనె నోమన సీకవక్కనో
హెచ్చిన మచ్చరంపు వెత, లెట్టుల మట్టుల నిల్వ వారమో. ౮౦

చ. జగదభి రామ మూర్తి యగు, చంద్రకళాధిగ నాదనున్ ధగ
ద్ధగిత చిరత్న రత్నరుచి, ధారలు మీరలు మీర యక్ష పన్నగ
సురసిద్ధ యానత మ, నంత మతాంత నితాంత మోహమై
జిగిదగు నొత్తు తచ్చరణ, సేవనఁ బ్రాంతత గాంచి యుండఁగా. ౮౧

చ మనమున విస్మయంబు బహు, మానముతోనిడి కీనులాగ్గితా
నిసుగొకొ ప్రాణవల్లభు సు, చేసివ వేసిన భాగ్యమె

మెఱయఁ దలంచునో తలఁచ, కేమను నోషధిసేతమెట్లొకో
మనసిజ వేదనాభరము, మానిత దాప్తి కలుంగు టెట్లొకో. ౮౨

ఉ. ఇట్టివి యోగవారినిధి, నెట్లు తరింతుమొ యంచుఁ గన్నెల
ప్పట్టున సంశయించుటను, భావ్యశుభోక్తి వచింప సాంగమై
దొట్టిన కూర్మిసచ్చుమిను, తోయ్యలి నా గగనప్రచారియై
గట్టులలేని వట్టిమతుఁ, గాంచఁగ నేగిన బోటివచ్చెనన్. ౮౩

—* కళావతి, నాయికలకు, నాయకుని, విప్రలంభము విన్నవించుట *—

చ. చెలువుని దండ కేగియుదె, చేడియ వచ్చె నటన్న నంతలో
నిలువున సాత్త్వికోదయము, నెక్కొనఁ జిత్తరు బొమ్మ యట్లు య
న్నెలతలు సమ్మదాంబునిధి, నివ్వెఱ నొంది యనన్య వేదనా
వలిత మానస్కలై ప్రియసఖి, వర్ధిత సంస్మరణాను రక్తిచే. ౮౪

చ. మనసు ప్రియోప భోగ్యమయి, మై విరహజ్వర భోజ్యమానమై
పనపడి యుండుచో నమృత, వల్లికి నట్లనె దేవవల్లికిన్
ధనము సమస్తముం బ్రియును, దంతము దెల్పఁగ బోటివచ్చెనం
చనుశుభ వార్తఁ దెల్పునన, జాతుల కీఁది గల్గదెద్దియున్. ౮౫

చ. పెనగొను నాదరమ్ము ధృతి, పేరిమిఁ గూర్పఁగ నించు కేనియున్
దనియని మానసమ్ము ప్రమ, దమ్మున మున్గఁగఁ దూలియాడు క్రొ
న్న నలనఁ దప్పముల్విడచి, నాటుతమిన్ జెలిఁగాంచు వేడుకన్
జనిరిరు చక్కలన్ మునరి, చాసలు కేల్గవలూత లివ్వఁగన్. ౮౬

క. ఎఱుఁగ నరుదెంచిన యమ్ముదితల చరణాబ్జములకు, మ్రొక్కి భరమ్మౌ
మదనుని ధాకల కాకుల మొదవుట గానెంచి బోటి యొయ్యన వారిన్.

ఉ. అయ్యెడఁ గౌఁగిలించి విన, యప్రియ వృత్తిని గార్య సిద్ధిమీ
కయ్యెఁ బదుండ టంచు భవ, నాంతర తల్పముఁ జేర్చి చయ్యనన్
దియ్యని మాటలన్ సొలపు, దీర్చుచు మోములు గాంచి నవ్వుచున్
దొయ్యలు లార! మీవలపు, తోడఫలించె నటంచు నంతటన్. ౮౮

ఉ. అచ్చటి కెట్టు లేగితివి, యమ్మహనీయవిలాస మూర్తితో
ముచ్చట లెట్లు సల్పితివి, మోహము గల్గి వధూల లావరిన్,

దిచ్చనెఱుంగఁ జేసెనోకో, యెల్ల విధంబెఱింగించు మంచుఁదం
గ్రచ్చుగ నెల్ల వారమునఁ, గన్నుల నవ్వుచు బోటి యిట్లనున్. ౮౯

ఉ. ముద్దియలార! యబ్బనన, మోహను నల్ల మెఱింగి చల్లఁగా
నొద్దికఁ జేసి కన్నియల, యోజనెఱుంగఁగ దెల్పిబోటులన్
గద్దరి తుంట వింటివిరి, కిట్టియలం బెడ వెట్టుపోఁకనీ
కిట్టఁగావు మంచు నను, నిందలు బాపఁగఁ బోయివచ్చితిన్. ౯౦

చ. తలపులు సంఘటిల్లెనిఁకఁ, దాల్చి గొనుండని క్రౌంచభేదితా
నలపు మెయింబ యింబొదిగి, నాడు కప్రపుటాటి మొస్వనూ
కులనడి పోల్లమాఁదు నిచి, కూర్చిన బంగరు తమ్మిదాడల
వ్వాలముల కంది యిచ్చి స్మిత, వీచుల నందఱి జేర్చియిట్లనున్. ౯౧

చ. నెలతల మిన్నలార! మది, నిండిన మోదముతో వినుండు క్రొ
న్నెల తలదాల్పు వేల్పుసుతు, నింగను పండుగ సేయుకోర్కె తే
నెలతల పోలె నల్లుకొన, నెయ్యపుఁ గర్జము దేర్పమేలు చి
న్నెలుతల మున్క తాముదము నిండఁగఁ బొంగుచు, నింగి చొగునన్. ౯౨

ఉ. పువ్వుల పాన్పుపోలె మదిఁ, బొంగి హుటాహుటి నెక్కి కవ్వపున్
మవ్వపుగొండ దాఁకివిడి, మట్టుతరించి విరించికొల్వునన్
జవ్వనులార! యచ్చటన, సాఖ్యమణీభవనాంతరంబులన్
జివ్వల దిండిలోనగుచు, శేషముసింద్రులఁ గంటినో యయ్యన్. ౯౩

కం. లోకాలోకన పటుసు, శ్లోకాద్భుత దృశ్యదివ్య, లోకములుం దపో
లోకమహాగ్లోకజన గ్లోక సువర్లోకములు వి, లోకించితిన్. ౯౪

శా. దేవర్షుల్గ్రహ సంఘముల్సుకృతసద్ధిష్ణేమ తారల్ధ్రువ
జీవాలంబన తారకల్సురతతుల్ సిద్ధర్షి రాజర్షులున్
భావాత్తేజన వశుబుకుములుడి, క్ష్వాలాంత భాసికముల్
దోవల్లప్పంగ దివ్యదీధితిభువ, స్లోకంబు గంటింబువిూ ౯౫

కం. మంగరకనక మహీధర, సుందరమై మెఱసెనటవ, సుంధర సుగుణా
స్పందరమాకందసమా, నందరసోల్లాసమైన, నందరమానే. ౯౬

చం జలనిధి శైలకాననవి, శాలనదీనద దేశపట్ట
స్థజల తీర్థదేవగృహ, సారసరోవర దీర్ఘకాసము

జ్వాలమయి యెల్లభోగముల, సర్వజనంబుల నోగ్య భాగ్యత
పులఁదని వొంటఁ జేయుభువిఁ, దొయ్యలులార! జగత్త్రపూజ్యమై ౯౭

గీ. పాపవృగానింగి యెడఁగల్చి, పుడమియెల్లఁ గన్నులకుఁ బండువుగఁ జూచి, కడుము దమ్ము
గ్రమ్ముకొన నబ్బురము నొంది, కదలలేని తమకమునఁ జూడఁ జూడ నంతటఁ దనర్చె ౯౮

సీ. కల్యాణగుణమయ, కటకప్రభాభాసు, రాదిత్యకాంతాప్తి, యతిశయముగ
నినదనంతమణిప్ర, కాశకూటస్థలీ, సరసవిద్యాధరా, సంగములను
నమృతప్రదానదో, హలవృషాకపిసేవా, సోల్లాస సుమనోళి, యోగములను
నవిరతాశ్చర్యానంద, నానుకూలసభాస, దానాసవరసుధ, ర్మాభికలన

గీ. నమరగిరివోలె భవ్యశో, భానమంగ, సంగతంబగు నాకమప్పాళ్, తుంగశైల
పబ్జజాండకటాహప, ర్యంతగగన, కర్పరాస్కందనములచే, స్కందమనఁగ

ఆ. వె. అట్టిట్టు కొనలగిట్టు, చట్టుపలంటఁ గొట్టుకిట్టనెలవు, పట్టుచెంపఁ,
గొట్టినూకుపట్టు, ముట్టెనోయనుట్టి, పట్టణంబుగింటి, పణతులార! ౧౦౦

కం. కనమేహార హారివనజా సనవాసవ సభలువాని, చందముగాదే
వనజాసను నాఁటిదొకో మనమెఱుఁగము కార్యవేళ, మనమునయెర్క.

మ. వరణాగ్రంబుల మ్రోయుతూర్యపటహ, ధ్వానంబు లస్నింగియో
వరణంబుల్జిలుగఁ గర్వరదృఢా, వస్థాన సంసిద్ధికిం
దిరహస్తంభము నిల్పిరోయన, సము, ద్దీప్యన్మణీ దండభా
సురకేకిధ్వజ రాజమత్తులుసుమో, చ్చుల్లొల్ప నంబరంబునక. ౧౦౨

ఆ. వె. దానఁజేసిపుష్ప, ధానుష్కశతకోటి, సుందరుండు ధైర్య, మందరుండు
బాహులేయుఁడేలు, పట్టణంబిదియంచు, నమృతవ నధినోల, లాడఁగంటి.

మ. మగరాగోడలకెంపు జాజురుచినిం, పణబచ్చ గానేలలిం
పగుముత్తెంబుల ముగ్గుజగ్గు మెఱుగుం, పణ మేడ లందున్నిగ
న్నిగతామేలిమి యోడుబిల్లలలర, న్నిద్దంపు టద్దమ్ములక
జగమెచ్చొప్పుకి సోయగంబుఁ బికిం, చణలోక సామాన్యమే. ౧౦౪

సీ. ఒకచోటనప్సరః, ప్రకరధింధింధిమి ధ్వనితదు ర్దమితమ, ర్దళరనంబు
ఒకవీధిబ్రహ్మర్షి, నికరపాపహితన ర్వశివాద్వయత్రయీ, వాదగరిమ

ఒక యూర శ్రేణులై, ణుకపరిచియ్యమా, నస్వరగ్రంథగా, నప్రసక్తి
ఒకచె తనానాని, ధోహపద్యాంకన ప్రకటితార్యాత్మజ, ప్రకట మహిమ
గీ. ఒక్కమూల సమస్తవే, దోపనిషద మేయసిద్ధాంత సర్వైక్య, తాఁయ ధోక్తి
ఇట్టిగంభీరగుణశక్తి, కిట్టలంబు, రాజశేఖరసుతమహా, రాజధాని. ౧౦౫

ఉ. మించుల సంచునొంచుజిగి, మేడలగోడల రత్నదీధితుల్
మించఁగరోద సింగలియ, మొండయిరేబ వలన్నమాఁటనొ
క్కించుక గానసీకజగ, మెల్లరజోగుణ వృత్తిఁగూర్పఁగాఁ
గ్రాంచనగారి వీకుగుణ, కల్పనరొండవ సల్వనాఁదగెన్. ౧౦౬

చ. అతలములోను గాఁగలుగు, నట్టిధరాంతర లోకముల్పయిన్
ద్యుతలములోను గాఁగలుఁగు, నూర్ధ్వమహోన్నత లోకముల్ జగ
త్త్రితయ ధురీణుఁడైనజగ, తీరథనందను వీటభూమికా
వితతులువోలె నెప్పఁటురు, విస్మృతిఁజెప్పఁ దరంబె యేరికిన్. ౧౦౭

చ. అతిశిమి రావృతంబులుధ, రాధరలోకము లంచుమానిసం
తతమువలంబ నావిరహి, తంబులునూర్ధ్వము లంచుమానియు
ద్ధతినుభ యైకయోగ్యతకు, దావలమైనటు లుద్ధరించిరీ
యతులిత మాపురంబునఁగ, నర్హదభస్తవ నీయమైతగెన్. ౧౦౮

ఉ. రోహణశైల రాజముమ, రున్నిలయత్వముఁ గాంచి యాతజా
తాహితవృత్తి మేరువున, హంకృతిమాన్పఁగఁ గోకసంభృతో
త్సాహమునంబురాకృతిస, తమ్ముగనూనెన నాఁగఁబొల్చుపా
గాహరి వాహనోచితివి, కాసమునన్ వెలయుంబు రంబిలన్. ౧౦౯

క. సేనాని దర్శనార్థము, సేనాని వహములత్తోన, శేషహరిత్పా
లానీకము బహిరావర, ణానీకము లందునిలచి, యభినందించున్. ౧౧౦

క. కన్నుల కానందంబగు, నన్నగరము సోయగంబు, లరయుచు నొకచో
నున్నత సౌధాగ్రిముపై, నున్నయెడం బౌరవరుల, నుత్కలికమెయిన్. ౧౧౧

చ. పురమునను న్కి మానిహార, పుత్తుఁడుదన్నగ రోపకంఠబం
ధురసన వాటికావిహృతి, ధూర్వహుఁడై వసియించి నాఁడటం
చరసితి నంతనయ్యుపవ, నాంతరదంతురి తాంశుమత్పలా
వరణములోని బోదియల, వాలికజొంపము లోవసించుచున్. ౧౧౨

ఉ. వచ్చుచుఁ బోవుచున్న పుర, వాసులముచ్చట లాలకించుచున్
రచ్చలు గానసించుసుర, రాజముఖామర పాళిఁ గాంచుచున్
నిచ్చలు సన్నిధానముల, నిల్చునయస్వల రాకనెంచుచున్
హెచ్చినకోర్కెఁ జేదలఁపు, లీక లెత్తఁగ నున్నయత్తఱిన్. ౧౧౩

చ. జయవిజయాభిధానలగు, శంకరగేహిని నెచ్చెలుల్మన;
ప్రియమున నంబపంపునన, భేద్యమనస్కుఁడు గ్రౌంచభేదికిం
బయిన ఫలాళి యందుకొని, యచ్చటికింజను దెంచియిచ్చి వే
పయనముసాగి పోవుతఱిఁ, బజ్జనసించుచుఁ గంటివారలన్. ౧౧౪

కం. కనివారొండొరువులు, మంతనమున నేనేమియట్టి, తెఱిముచ్చటలో
య్యనవాఁకు దురోయనిమన మునసువ్విళు లూరిమోద, ముననాలింపన్.

ఉ. వింటివ తేజయా? నుడవవే విజయా! జయశాలి యైనము
క్కంటిసుతుండు దిగ్విజయ, కాలమునందు వికుంఠధాముహు
దంటినవంటునన్ సరసి, జాక్షునిబిడ్డలఁ జూచి కంతుసం
లుంఠిత చిత్తవృత్తియయి, లోఁబడియెన్ విరహార్తిఁ దూలుచున్. ౧౧౫

ఆ. వె. సకియయామృతవల్లి, సౌందర్యవల్లుల, చక్కఁదనము మనము జననిగారి
యొద్దఁ దెలియువార, లుగ్గడింపఁగమున్నుదు, విందుమేకదమ్మ, యింక కేమి.

చం. తనకొడుకీ విరాళితను, తాపమునన్ డపియించు టాత్మలోఁ
గనిపతి యాజ్ఞ చేఁగదలి, కాంచలచేలుని యొద్ద కేగినా
దనలను వేడఁబోవునట, తామరసాయత నేత్రిగారియి
య్యనుపమ మోదవారినిధి, యందుమునుంగఁగఁ గందుమిన్నొయిన్. ౧౧౬

గీ. కలికి! దీనికిఁ దార్కాణఁ, గంటివటవె, మనము ఫలము లొసంగుచో, మనసు వేఱు
తలఁపుతో నుండెఁ గానియు, త్తఱి గుహుండు, చనవు మునుపటివలెఁ జేయఁ, జాలెనటవె. ౧౧౭

చ. అనియని వారిత్తోక్తుల జ, యావిజయాంతిర హాస్యగోష్ఠిలో
వినివిని వేశితాత్మనయి, వేడ్కలు తీనెలు సాగమెల్లనం
జనిజని తాను దాగమునఁ, జందనతుందిల కుంజపుంజరం
జనజన హృద్యమైన యొ, చల్లని కానల కోనలోనికిన్. ౧౨౦

గీ. పోవఁ బోవఁ దు, భువన సుందర దివ్య రత్నఖచిత భవన, రాజమొకఁడు
ప్రాతరుదిత తరణి, భానుసహస్రసం వలితపూర్వ శైల, కలనఁ దనరెఁ. ౧౨౧

ఉ. అందఁజి రత్న రత్నఖచి, తాధర భూమికఁ దత్తదంతరా
ళిందములం బచాడ భట, లీలలు తూపెసలాడఁ బొందియ
స్పందమనోజ్ఞ శోభిషరి, చారిక యందము నొంది కేళికా
మందిర సీమఁ జేరితి న, మందము, దాంబుధి నోలలాడుచున్. ౧౨౨

చ. మనసు విరాళిఁ దూలియొ, కిమట్టున నిల్వమి నిందిరంబునం
దనస విధంబు నందనుఁగు, తండము లేమియు లేక యొంటిమై
ఘనతర రాజయోగలయ, ఘట్టితగాఢ మనోన్మనీవశ
మ్మునఁ దపియించు యోగిగతి, ముక్కను వేలుపుఁ బట్టియున్నెడన్ ౧౨౩

—* శ్రీకుమార స్వామిం జూడ నారదుఁడే తెంచుట. *—

సీ. నాసాగ్ర భాగవి, న్యస్తలోచన వృత్తి బ్రహ్మము సన్ధాన, పదవిఁ దెలుప,
అంగసం సంగిభ, స్మాంగ రాగద్యుతుల్ నిఃకళా స్ఫూర్తితో, గజిబిజింప
మారుతాహతిరోమాయు, మహతీస్వనము సేయు బ్రణవనాదంబుతో, ననుకరింప
స్ఫటికాక్ష మాలికా, వలయదృత్తులు హస్త నఖశిఖాచ్ఛవుల సం, దడులఁ గలయ,
గీ. మహితగంగాంబుపూర్ణక, మండలుప్ర శస్తహస్తంబు మెఱయునా, శాస్త్రసిద్ధి
ఘటకకుతుకైకతానుఁడై, కదలియచటికమరమునివచ్చెఁ గేకివా, హనునిగనగ

క. తెలిఁగొంటి తపసియచ్చటి కరుదెంచిన వార్తఁ దెలుపు, నంతనచరునో
క్కరు నంపిత్తోడుకొని చనికరమతి గౌరవము భక్తి, గడలుకొనంగన్. ౧౨౪

క. నవరత్న పీఠసత్యుత్సవమున గూర్చుండఁ జేసి, సాంగ సపర్యా
వివిధోపచార ములనిడి యవురన్ వేల్పొక్క గద్దియన్ గుహుఁ డుండన్ ౧౨౫

ఉ. వేలుపు మౌని యభ్యుదన, విశ్రుత విక్రమునిఁ గాంచి మందహా
సాలలితాస్యుఁడై శశిధ, రాత్మజ! తావక దర్శనాప్తి యు
ద్వేలముదాప్తి సించెఁ బరి, తృప్తతపః ఫలమెల్ల నబ్బె మ
చ్ఛీలము సార్థమాయెనరి, శీలితమయ్యె భవత్కృపాప్తిచేన్. ౧౨౬

చ. అనుటయుఁ దాపసేంద్రవినుఁ, మాయను మానసమిఁ కేలదేవతా
మునిజన పుణ్యమూర్తివిస, ముజ్జ్వలతావక వాక్సుధాభిషే
చనమునఁ దెల్పెఁ గాంచె మది, సంభృతపుణ్య ఫలంబులబ్బెనీ
యనుపమ దృక్ప్రసారము సు,ఖాంబుధి వీచిక ముమ్ముఁ బొల్లకున్. ౧౨౭

చ. హరునకు రుద్రైక భాజనము, లార్యులు మీరిటు లేగుదెంచుటన్
బరమపవిత్రమయ్యె నిద, పారవిభూతి శుభాళిశోభిలెన్
జిరసుకృతంబు లుల్లసిలె నేను మిమ్మాకు భవత్ప్రపాపరం
పరిలునసంత రాయతను, బాటిలు నేను సివర్య! చెప్పుమా. ౧౨౯

చ. అనవినిపూర్వ మిట్లనుచు, నాత్మజుతో భవదీయభావతం
గసిమనుచున్న వారికిసు, ఖ బహుగాక కొంతతి లేమినీ
యనుపమ విక్రమానలము, హర్షి శేముష ఖలకర్మ్య క్రియా
వనపటలిన్ దహింపగన, పారకృపారస లోచనాంచలం. ౧౩౦

క. అనవరత తపఃకలనా, విరివేకిత చిత్తవృత్తి, వేడుకగొనసీ
యనువున గాలముజరిపెద ననఘ! భవత్కారుణనాకు, నభిమత మొసగుమా.

ఉ. అన్నిటలెస్సగాని సుజ్ఞ, యస్యవెలుంగను నేడుసంశయా
పన్నముపోలె జిత్తమొక, భంగినయున్నది తావకీయభా
వోన్నతి నీదుగ్రమ్ముజ్వల, నోపమమయి గుదియించె బోధముం
గన్నది తెల్పుమిత్తఱివి, కాసముఖాంబుజ వాగ్విలాసినై. ౧౩౨

ఉ. ఎన్నడు నాత్మశంతతన, హీనముచేయదె నేడుదోపనీ
కున్నది యన్యచింతసలు, పోపమిచాల దళంబుసాత్వికో
త్పన్నదశావ శాకృతిన, పారచలాచల భావసూక్షమి
మిన్నకయుంట ఘోటికిని, మేయరసాస్పద లేపమయ్యెడున్. ౧౩౩

క. నడలున్ నుడులం బాడమెదు, వెడవెడ యూరుపులమోము, వెలిసిగ్గులనై
తడబాటుల బాటిలునిదె, వెడనిలుచే బరపువేడి, వేటుల తెలుంగుల్. ౧౩౪

మ. సుధన్వుల్ద్రి హిరణ్యాండ తండములనెం, చన్ వ్యోమ పుష్పోపముల్
తరుణీకోటులు నీకునందమునరున్, దాసీగణప్రాయులై
వ్యవసన్ నీతల పెట్లో యట్లయగునే, వ్యారడ్డ మూవారలి
క్కరణిన్ వేటతలంపు లన్మరుగశం, కాతంక మింకేటికిన్. ౧౩౫

ఉ. మానుము స్వాంతచింత, తిర, మాభరమా పరమాదరమ్ములో
నూను మొకింతతెల్పుమని, యుక్కివమంతయు దానెలుంగన
ట్లానడి దేవపూజనమన, మారయ బల్కిన నల్లనవ్వి సే
నానిపచించె మోదకల, నావలనావల నాసకైఖరిన్. ౧౩౬

మ. మునిచంద్రా! సకలార్థవేత్తలుఁ జగ, న్మూలాస్య హాస్యావళీ
కనసంభూత చరాచరాత్మకగుణ, గ్రామాల్ జగద్భావనా
వినివేశమ్మున గోచరింపనిగుణా, వేశంబు లొందెవ్వి? మీ
కనుమానప్రమలేల సర్వమునుష్ణా, తార్క్షంబె యిట్లు కేల్కిన్. ౧౩౭

ఉ. నామదిఁజూడఁగోరి యిటు, నాటఁగ నాఁడుట గాని చింతయొం
డేమియు లేదు ప్రాణివ్రాద, భీష్టఫలప్రదుఁ డీశుఁడన్యచిం
తామహితత్వ సంపదనె, డంగదియించిన నొందు జెడ్డిమా
యామననంబునన్ మదికి, సోఁగడదేహికి నైజమగ్నతల్. ౧౩౮

క. అనిమానసీకయ యుచితఁపు టనుపులగోపన మొనర్చి, రీగాఁడుట మునితా
మనమున సారసి గౌరవఘనతన్నా యెడగణించె, గాగుహుఁడనుచున్. ౧౩౯

ఉ. నీమదిధైర్య దార్ఢ్యమును, నీవుగణించితి నెంతయేనినీ
ప్రేమమునిండి యున్నదొక, బిత్తరపుష్పల వంతసీమహా
ద్దామత నీవెఱుఁగకవ, ధాజనపూత్రునిపోలె పోలెదిం
కేమికొఱంత నీతలఁపు, లెల్లఫలించు గిరీశనందనా. ౧౪౦

క. నీవుతలంచిన తలఁపు, ద్దేవతలుం బెద్దలెల్లఁ, దీర్చిరిగాన
న్వేవెతలఁ దలంగుము సిరి, గావుత మని నుడివితివిసు, కంబుగుమీఁదన్. ౧౪౧

క. శ్రీయుతులౌ లక్ష్మినా, రాయణులిర్వురును మనసు, రంజిలి నీకున్
శ్రేయఃప్రదములగఁ గన్నెల, నీయాలోచించి రఖిల, వేష్టములుగాగన్. ౧౪౨

శా. ఈకర్జంబు వికుంఠధామమునల, క్ష్మీశావరోధంబునన్
పాలికల్యాంబును జెంజెవింటెమిభవ, ద్భాశ్య బు భవ్యంబుగా
మాకుం బంధుఁడవైతి వింతకుమముల్, నన్నింతువో యెంతువో
నీకుంజిక్కితి మెట్టులైనఁ దగదే, నిక్కంబు మేలెంచవిూ. ౧౪౩

క. ఈమాఁట నీకుఁ జెల్పితి, సేమముఁగను మిపుడు నీదు, చిత్తము దేర్పన్
గాములు నమృతవల్లియు; గోమలి చెలియలును నెసరు, గొను సకిచేరన్.

క. సందేశముగానించిరి, సందేహమువలదటంచు, జటురతవెఁ ఆయన్
బృందారకముని నుడివిను, మందానందమున స్కందు, పుదిబారలించెన్.

క. అప్పలుకుల యర్థంబులు, తప్పకమది నరసిగుహుఁడు, ధైర్యము తనలో
ముప్పిరిగొనఁ జమకలక్కఁ, జెప్పగదాముని యటంచు, ధీరతనొంచెన్. ౧౪౬

గీ. పోయివచ్చెదనని తెల్పి, భువనభూష ణుండు నారదమౌనియ, నూనభక్తి
నిందుధర నందనుండొనప్పు, నిష్టపూజలందిస్వేచ్ఛానువర్తియై, యరిగెనపుడు.

ఉ. వేలుపు మౌనియంతసము, పేతయథాగత వృత్తియైననా
ఫాలవిలోచ నాత్మజుండ, పారమనోవ్యథ మున్నువిన్నయ
య్యాళిసమాగ మంబునకు, నాసలుగొల్పుచు నుత్సుకత్వలీ
లాలలితాస్యుండై తృణచ, లాచలమున్ భ్రమగొల్ప నాత్మలోన్. ౧౪౮

చ. తపసులువారి మాటలుయు, ధార్థము లింతియకాదువారిలోఁ
గృపగలవాఁడు దేవముని, కేవలతత్వ పదార్థచింతనం
బపరిమితంబు తద్వచన, మన్యపథప్రతి పన్నమేలయూ
వ్యపగత సంశయుండనయి, యాత్మసుఖంతు సమర్థనిశ్చితిన్. ౧౪౯

ఉ. ఆదరణీయ మాగదమ, హాత్ములువారి యనన్యలభ్యమున్
వాదనహంబు నై తగిలి వచ్చినసౌఖ్య కరంపుభోజనమొం
డేదివిచారణీయమెద, నెంచసఖీమణి వచ్చుమేలుని
గ్వాదముగా లభించునని, వస్తుగతిన్ గుహుండెంచు నంతలోన్. ౧౫౦

—* కళావతి కుమారస్వామిని దర్శించుట. *—

గీ. అతిర సాబాన్మృత్తి నేకాంత, మగుటఁ దెలిసి, సకియయును సంధికినియనూ, సమయ మనుచు
మింటిపొడకట్టి పుడమిపై, వెఱచినిలుచు, మించునాని ల్చె గుహునివీ, క్షించి మొదర. ౧౫౧

చ. కలితమృణాళ నాళలతి, కాయతమైన మరాళివోలెమం
జుల తరతార హారపరి, శోభితహస్త సరోజమైనము
జ్జ్వలముఖ చంద్ర దీధితుల, చందమునన్ నవమందహాసమిం
పొలయఁగఁ జూక్కిన్ వెరగు, నుబ్బును దోఁపఁగ నల్లనల్లనన్. ౧౫౨

ఆ. కరములెత్తిమ్రొక్కి, కరుణారసాస్వాద, భరము చూపుగొనలఁ, బట్టుగొల్ప
మనసులోన నిండు, మన్ననఁ బురిఁగొన్న యనువు దెలసిచేర, నరిగి నిలువ.

గీ. మనసి జానల జాజ్జ్వల్య, మానమాన, సమ్ముని స్వేతుశిశిరోష, చారుసుఖపు
నొఁదెఁగన్నలుఁ నల్లనై, యొఁడలు లేచు పడలు సుధసోసలో మన్గ్నవమ ఫదోఁషె.

ఉ. ఎవ్వరి బోటివో? సరసి, జేకొన! యేకతమున్న మాకునై
యివ్వన భూమిఁ గ్రుమ్మరుచు, నేకతము న్నడిఁగోరి వచ్చితో
మవ్వము రామణీయకము, మానుషమై రమణీయ మయ్యెనా
కవ్వల రాచరాచ దొరఁగ, కర్నాజ యాబు లొసంగు శక్తివో. ౧౫౫

క. సురమానినివో? లేకా, సురకామినివో? వి, శేషసుష మానహాసుం
దరరూపరేఖల నసుం, ధర గ్రుమ్మరు విపినదేశ, తామూర్తివో కో? ౧౫౬

క. భవదీయ వాక్సుధారస, భవమాధురి శౌకపైక, పరుషధ్వనులన్
జెవుడుపడు నామపీనుల, కవరుచివోఁ జేసి తెలుపుమా మితసూక్తిన్. ౧౫౭

చ. పలుమరు నిట్లు పల్కుశిఖి, వాహను హాసవిలాస వక్త్రునై
పులక సముద్గమస్ఫురణఁ, బొందఁగఁ గన్గొన రెత్తి చూచి యో
జలధిగభీర! యేనసుర, సౌరవ ధూటుల లోనిదానఁగా
నలవన లక్ష్మిగాను గను; మాశుగ శక్తినిగాను చూడుమీ. ౧౫౮

క. అనుచుం బల్కుచు నెమ్మెయి, జనితములగు పంచశరద, శాగతులమెయిన్
మనమిమ్మెయి విస్మృతి గుహుఁడస యతమోహాన్ధమున్గన్నఁ, డగునని త్వరతోన్.

వ. సత్వరంబుగా నిట్లని విన్నవించితి, మహానుభావా! యేనంజలధినందనీ నయనారవింద భువనబాంధవుండగు ఖగరాజ సైంధవుని ముద్దుకూఁతుల గు నమృతవల్లీ సౌందర్యవల్లులకనుగుటిలు పుట్టుచెలి త్తియంగా నెఱుగుము. బహుసహస్ర సఖీజన మధ్యంబున నన్నుగల కంఠీ నాహుంబున మన్నించెదరు. మద్వియోగంబున ననేకనాడికా కాలంబు కల్ప కల్పంబుగా దరపువంత విడరాని నెయ్యంబునను పలాలింతురు, మఱియుం బ్రాణంబులకన్న నతిమధురంబైనను నాకుం దెలుపని యన్యోన్య రహస్యంబు లెఱుంగని మన్ననలం గన్నుల వింటివాని యానఁగా సున్నతురు. కావున నీవు దిగ్విజయయాత్రాకాలమ్మున హాటధామంబున నంతిపురంపు నోద్ధోలగంబునఁ దంద్రించెరు వం గన్నెలు గూర్చున్న యవసరమ్మున మీరచ్చోటికిం జతుర్భుజదర్శనార్థ బరు దేరఁ జూచినది యాదిగా భవదీయ రూపరేఖా విలాస వైభవం బక న్నియల మనోమీనమ్ముల నాకర్షింపు మహా జాలంబై, భ్రమణగొల్పుట వలన సమను భూత సకలసాత్త్విక తత్వాంబొకట రెట గొఱుతగా నొలసిన స్వస్థాని వేదనంబునకై నన్నటఁ బుత్తెంచిరి. అభంగుర విరహ పాండిమంబున నస్మృతా స్వాదనంబున నైనను రుచినింపని చేవం విధాను భావంబుల బ్ర

వర్తిల్లెదరని సూచించి యుత్తారకారి కంధరా పీఠంబున దాపక సందేశ సముదారంబుల నిమ్ముక్తా హారంబులునిచి నమస్కరించి కరంబులు ముకుళించి నిలిచితి. ౧౬౦

ఉ. రాగరసాపు మూర్తులన, రక్తిమఁ గ్రమ్మ విశాలనేత్ర దృ
గ్యోగ మొనర్చి యయ్యెడ న, యోగభరజ్వర వేదనావశ
ప్రాగుది తాంగ ఘర్మజల, పంక్తులు గంధ జలార్ద్రశాటికా
భోగమునం దెరల్చుచు న, భూతకృత నిశ్వాస నపుం బెల్లునన్. ౧౬౧

గీ. తెలిపిఁ జూపని యలయికల్, దిప్పర లేఁచి రత్నపీఠంబుడిగి, పుష్పరచితమైన
సెజ్జపై మేనువ్రాల్చియు, చ్చింత నింత నంతనెన్నఁగు లేకుండ, నరసి యరసి.

మ. కలకంఠీ! యిటురమ్ము నీపలుకు ము,త్కల్యాణ సంసూచనో
జ్జ్వలమంత్రావళి వోలె బీజగఘటనా, చ్ఛాళుక్యముం జెంపె సం
కుల సంకల్పన చోత్సవంబు మెఱసెన్, గోత్రాతి భూతింజలా
చలభావిప్ర మదాభియోగము యి,ష్టంబాత్త మయ్యెంజుమీ. ౧౬౩

మ. నెలతా! నీసహకార వర్తనము రాజించెన్ సదాభోగ మం
జులతల్ గొమ్మలకున్ ఘటిల్లెఁగద మె, చ్చుల్గా మరున్మండ లో
చ్ఛలితాను గ్రహమున్ బోసంగెఁక నై శాఖాను కూల్యంబమై
కలకంఠీ లలితాంక సార్థకత చొక్కంబయ్యెసం చెన్నఁగన్. ౧౬౪

చ. అలనాఁడంతి పురంబులోన జలజా, స్యల్కీధుశైదండలం
గలమంజీర ఝుళం ఝుళధ్వనులు మ్రో, గన్ వచ్చురాయుంచలం
దలఁగఁ జేఁయఁగ లేచిపోవు తటిమ,త్స్వాంతంబు పెన్వెంటరా
దొలఁగండోయిము సచ్చుటన్నిలిచెఁ ద,త్స్వాచ్యంబు మచ్ఛేయమై. ౧౬౫

శా. ఆహారమ్ములుగేరి మిత్రిచతుర, వ్యాహారముల్గూరి ప్ర
త్యాహారమ్ములు మెచ్చి యంతనరి సం,హారమ్ములన్ జొచ్చిలో
నీహారంబులు నెండ వానలన కెంతేఁ గాసిఁ దూగాడున
స్నేహమ్ములు గూర్చి తేర్చి రిగడే, యుంకింది రాభాలకల్. ౧౬౬

చ. అనికను దన్ను లక్ష్యనెడ, నస్రు పరంపరలంను పుంచి యొ
య్యన సకలాంగ మర్శనము, లంను ముహుర్ము హురుద్ధఘర్మ వా
రిని బొరలించి హారములఁ, బ్రేమర సాంబుధి నోలలార్చి ని
న్ననిశలమై విశాలి నెన్, వడుకు తంఘరిఁ దీర్పనోయు నన్. ౧౬౭

ఉ. హారములార! మద్విరహ, జానలతాప నివారణ క్రియా
ధారములార! రాగర స,దర్పిత మద్దయి తాకుచాంతర
స్సారములార! మిమ్ముఁ గఘన, సారశటీర సుగంధ చెర్చలం
గోరుసుపాణు లంజనువు, గూర్చి చవుల్ నెలకొల్పి శే చెలుల్. ౧౬౮

మ. జలమధ్యంబున శుక్తిసంపుట గుహా, సంవాసముం జెందిని
శ్చలసూత్రాత్మని గూఢ వృత్తి భుజియిం,చ గ్రుచ్చి పూబోండ్లు ర
క్షలులం జేర్చి రితద్వియోగ మెఖులో,ర్చన్వచ్చ మతిస్వాంత మం
దలి వేణుల్గల రందు గాంచుఁడను, నాయట్లకుం జేర్చు న్నరుల్. ౧౬౯

ఉ. ఇంతహితంబు సేసినస,మీహిత బుద్ధిని నీకృపారసా
క్రాంతత మెచ్చు వచ్చెగల, కంఠి! లతాంగులు మద్వియోగచిం
తాంతరి తాంతరంగలయి, యక్కట యెంత భ్రమించి రొక్కొ మ
త్స్వాంతము జెంచు నించువిలు, దంటనెలంతల నెంత సేయఁడే.

సీ. పలుకు చక్కెరలకై, పగసేయు రాచిల్క తండంబులకు నెంత, తలఁకిరొక్కొ
కంఠమాధురికినై, కలుషించుగండు గోయిలగుంపులకు నెంత, గలఁగిరొక్కొ
చికిలి జూపులకునై, చేరి బారులుదీరు తేఁటిమూకల కెంత, తెఱలి రొక్కొ
మేనిలో వలపు న,గ్గిలిగమ్మఁ గొనవచ్చు మదలగాలికి నెంత, బెదరిరొక్కొ

గీ. మత్కృతంబైనయీజాలి, మమతసోలి ముప్పిరిగఁ జుట్టినవిరాళి, ముదముదూలి
కనికరము మాలి మరుఁడపై, గొనిశరాళిఁ జెనకపసిబాలికలు పూల, సెజ్జఁ గ్రాలి.

మ. రమణీ! నిన్నిటు బంపు వేళ లలనా, రత్నంబు లేమేమిలోఁ
దమివళ్లొత్తఁగ నాడి రోకలుగు సిద్ధంబౌత యుందెల్పు మ
క్కమలాక్షీ హృదయేంగి తిజ్ఞ నుగుణా, కల్పంబ వీనూత్న సం
భ్రమసంకోచమిఁ కేలఁ శ్వాసగత ప్రాణుండ నింకేటికిన్. ౧౭౦

గీ. సచ్ఛ్రుతి వహేతు కరుణాల, వాలవేల నానసూనంగఁ దెల్పుమా, నానసూన
వచనరచనలమాయూర, వాహునొద్ద నంజలిఘటించి యిట్లంటి, నమ్మలార.

—* అమృతవల్లీ సందేశము. *—

చ. సరసశిఖామణీ! జనక, సన్నిధి నింగని నాదుడెంగమ్మ
విరిభవ దంష్ట్రిఁ జేర్చితిన, నింద్యదయామ యద్భక్త్వరంపరా
ఘురములనోల లార్చికర, సారసమున్మను రోజమండలాం
తరమున నుండి నాకభయ, దానమొసంగుఁడు వేయునేటికిన్, ౧౭౧

చ. స్మరశతరూప! నీచరణ, సారసయుగ్మము నాశ్రయించితిన్
పరమశివ ప్రకాశమున, నా తెలివితేనియ సోనవానలన్
బరిణత చుంబనంబులను, మాత్రముఁ దీర్ఘముచుం బ్రసాదమున్
గరుణ నొసంగి సద్గురుని, కైవడిఁ బాపము లార్పఁగాఁ దగున్. ౧౬౫
చ. పరమదయాంతరంగ! నిను, బాయని మేషము కల్పకోటియై
పరఁగెడు నవ్విలోకనము, పారకృపారస భావ్యమయ్యెనే
కరణిని నాత్మవశ్యలగు, కాంతల కాయలి గాగనాత్మలో
భరముదలంగఁ జేయుమద, పాయము పాయుము భోజ్యమై తగన్. ౧౬౬
క. ఈపలుకు లమృతవల్లీ, పాపతిలము లాంబికేయ! పరికించు మనః
కోపదములో సంకల్పజ, తాపదములో తపశింబలిని, దానమునీకున్, ౧౬౭

—* సౌందర్యవల్లీ సందేశము *—

క. సౌందర్యవల్లి చేసిన, సందేశము విన్నవింతు, సరససుధా ని
ష్యందద యారసలహరీ, తుందిలముగు మాన, సంబుతో, వినుమనఘా. ౧౬౮
ఉ. నీచెలువంబు గాంచి రజ, నీచరభీకర భానుమండలీ
గోచరితాంత రంగనయి, ఘూర్ణిలు ఘోరవియోగజ జ్వర
వ్యాచకి తాయతిందలిచు, వంగురితందర నెంద తొందరే
నీచెలు లాగిపట్ల భరియించితిఁ బాచితి బోటి నేఁటికిన్. ౧౬౯
శా. ఏకద్విత్రి దినావధిన్ శతసహ, స్రేందీవరస్నిగ్ధసా
లోకత్వోద్వద నేందుమండలసమా, లోకంబు గాదేనియా
లోకాలోక జగత్ప్రచండ బిరుదా, ఖల్ మోహియు నేతెంచనీ
భీకృన్మంద మరుద్వార్షులకునా, వేదింతు మద్దేహమున్. ౧౭౦
శా. భక్తత్రాణధురీణ! నీకుఁగరుణా, పారీణతల్ నైజముల్
భక్తిన్ రక్తిని సక్తినిన్ జరణసేవా, వాంఛనట్లుంటినీ
ముక్తాహారము వోలె నీయురమునన్, మోదింపఁగా జేసిచో
ముక్తాహారమునై భజింతుఘనన్, ర్యుక్తాంబ రాఘ్యాత్మమున్. ౧౭౧
క. ఆతెలివలు వలికిననుకు లీ తెలుఁగులు, నేనువచ్చు నెడ నెడలీద
త్యాలతమై యష్టమదశఁ జేతోగతి నరసికరుణ, జేర్పఁగవలయున్. ౧౭౨

మ. తలిరుంబోఁడుల పారతంత్ర్యములతో, భానుష్కృదోశ్శక్తిఁగ
ల్గలరాచండకర ప్రతాపముఖుఁడై, పాంథాళి పాలింటికిన్
బ్రళయంబోయను మందమారుతముసం, భావింప నుత్సాహసం
దలినాఁడోఁ చెంద్వ దేకజీవనలుచుూ, డఁజేడె లూహింపఁగన్. ౧౫౩

ఉ. మాటలు వేయుసేల బహు, మానముతో విరిబోఁడులన్నిరా
ఘాటకృపాంత రంగగుణ, ఘట్టితదివ్యభవద్విలాపసం
ఘాటసుధాంబురాశినవ, గాహ మొనర్పఁగఁ జేసి యేలుకో
మ్మాటవికాబ్జ దీధితుల, యందమునొందఁగ జేయకేశ్వరా. ౧౫౪

క. అనిపలికిగమనసూచన జనితోత్సాహమునఁ గొలువు, సందడిమొక్కిం
తను వెజ్జఁగి కనఁగఁజేసిన మనమున మద్దైన్యరసము, మానఁ జేయున్.

చ. తలఁచిమనో జతాపశిఖ, దాఁగులు వాగు మనంబుఁ దాల్మియున్
జలువనొకింత మ్రాన్పఁ బలి, ఝుమ్మునఁ దుమ్మెద లాడుతమ్మిపూ
దలగడ నూతఁ జేసుకొని, తల్పము పైఁ బవళించుచుండిచే
క్కులఁజెయి పెట్టిపల్కెరస, ఘూర్ణితదృక్కవు లుల్లసిల్లఁగన్. ౧౫౬

గీ. తమ్ముగనుటమమ్ము, మమ్ముగాంచుటదమ్ము గుందకుంతములను, గ్రుమ్మిమనఁదు
వలపుఁ కేటునుబులు, వలపైచి బేడస కొదములట్లుకలయు, వదిమిగదిమె. ౧౫౭

గీ. పరులబుద్ధులకన్యగో, చరతలేమిఁ దమవలపుగొండయంతగాఁ, దలఁచుబోత
కానిపరులనుఁదమయట్ల, కాగవలదె, "యాత్మవత్సర్వభూతాని" యనఁగవినవే.

సీ. అంబుజాక్షునికొల్వు, టంతిపురంపుఁగోఁగనుసన్నఁగా దమ్ము, గాంచుమొదలు
పవలు రేలునునల్వు, పవలు రేలునువోలె దనుకమ్మునన్నుద్రోయఁ, దరముగాక
దృఙ్మఖాత్మ జదశా, దీనమానసముతో నఖిలమ్మునరుచిగా, నాత్మఁ దలఁచి
ఎనయునేరుపులెవ్వి, యోనియుఁగానక విప్రలంభవ్యథా, విషశస్మృతి

గీ. బొరలుచున్నట్టినన్నుఁ దేల్ప, బోటినేటి కరుఁగుదెంచితివింత మే, లయ్యెనమ్మ
ఇంతకునుమేలువార్తరా, దేనిమనసి పథ్యకోటకిఁ దాలుదాల్త, వాఁడుఁగానే.

క. కేకారవగర్జాధ్వని భీకరబర్హాభ్రనికర, పృథులంబైన
ఝాకాలము బలెనెక్కఁడు కేకింగని బెగడిచూడఁ, గినియునునెపుడున్. ౧౬౦

క. రాకాహిమకర కరనిక రాకారము కాంతిమయ్యె, నళిఝంకారాం
గీకారము తేజమ్యెను సాకారంబునవిరాళి, యలముటకతనన్. ౧౬౧

న్మినాడలు కన్నులనద్దుచును రమ్ములందాల్చుచు విచ్చలవిడిం బెచ్చు పెరిగిన
మోహాంబు ముమ్మరమ్మున మునింగి. ౨౦౦

ఉ. దండలు కేల నందుకొని, తావులు గ్రమ్మఁగ దండనాథు కే
లండలుగాంచఁ గాఁగలఫ, లంబికతోఁడనె గ్గెనంచున
య్యండజ రాజయానలుకు, చాగ్రములందిడి కన్నుదమ్ములొం
డొండనుటిచ్చి కంఠముల, నుంచితదీక్షణ బద్ధతృష్ణలై. ౨౦౧

ఉ. తమ్ములజాషఁ డాచుఁగను, దమ్ములనొత్తుచు గందు తేఁటిమో
త్తమ్ములు ఝమ్ము ఝుమ్మనని, తావులుగ్రమ్మఁగ, మేల్కడాని యుం
దమ్ములు పాణినాథుభుజ, దాడములేయని యాపరాని మో
దమ్ములఁ దత్కరగ్రహణ, ధన్యలమైతి మటంచునుబ్బుచుక్.  ౨౦౨

ఆ. వలపుగలిగి మంచి, వారిలోసవసించి మిత్రసంపదలకు, మిగులనలరి
అమృతమూర్తి నొంది, యాత్మేశు నొద్దఁ జేరైనవారు విహారమటంచు నెంచి

క. రాజీవమ్ముల సరిదగు, రాజీవమ్ములను సిల్ప, రతిపతి శరనో
రాజీవమ్ములఁ దడబడు, రాజీవమ్ముల విధంబు, రాయిడిపడఁగన్. ౨౦౪

ఉ. తల్లికి నునిక్కపట్టులయి, తండ్రికి గన్గన సొంపుఁ గూర్చరం
జిల్లుమనన్న లిర్వురకుఁ, జిత్రసుఖాసన సర్వమర్దనా
త్యుల్లసనమ్ము గూర్చిన ప్రరోపకృతుల్ విభుఁగూర్చు వారలై
యొల్లమి మమ్ముఁ దేర్చితిరే, మోహనమాలికలార! చూడఁగన్. ౨౦౫

మ. అని సౌగంధిక మాలికల్గని తదు, ద్యచ్చేతనా చేతన
త్వని రూఢస్థితిఁ దక్కయష్టమ, దశా, వ్యాప్తిన్ మనోభీష్టసా
ధనవాంఛారతి నుత్సుకత్వ పదవీ, తామ్యద్ధృదంభోజలై
వని తారతమ్యము లప్పటప్పటికి దీ, ప్యన్మన్మథోద్దీపతన్. ౨౦౬

ఆ. వేగలేక మోహ, వేగపీడిత హృదా వేగల మ్రియానను, రాగజలధి
నాగలేకస్మరశ, రంగత జ్వాలనార్చి వేగవేగ నంత, వేసుజొచ్చె. ౨౦౭

—* ఉషఃకాలము *—

చ. వలపుగ బుల్కొనన్ బొరలు, వాసనలన్, బయికొన్నమై యలం
తలతల ముక్కలై యలము, దర్పక కృద్దశ మీదశావ శా

కులతలఁ జెందసీకలత, కూనలఁగావగుసాంద్రు రాగమొ
క్కలమగు తద్ధ్వజధ్వనుల, కైవడి వేఁకువ కోళ్లుకూయఁగన్. ౨౦౮

మ. సమయారాధ్యుఁడు పుష్కరాభ్రతటినీ, సుస్నాతుఁడై ప్రాక్ప్రభా
విమలాచ్ఛాదన మూల్దరించి కుముద, ప్రేంఖద్రజఃపాళిభ
స్మము భృంగాక్ష సరుల్వహించి శివపూజం జేయఁ బూర్వాద్రిహ
స్తమునన్ స్ఫాటికలింగరీతిఁ దగెనం, తన్ వేగు జుక్కయ్యెడన్. ౨౦౯

మ. రజనీకాంతతమోగ్రహార్త తజకో, రధ్యానముల్ సేయుచున్
బ్రజలంభీతిల సేయఁగా హిమమహో, న్మత్తజ్ఞఁ డాత్మప్రభా
వ్రజభూతిన్ బలియిచ్చి పశ్చిమసము, ద్రస్నాతగాఁ జేయసం
ఘ్రిజలం బార్చుచుఁ దోడ్కపోయె ననఁగా, రేజాతె రేరాజనన్. ౨౧౦

సీ. విటవిటీజనరహో, రటనపర్యుషితాంగ రాగఘుం ఘుమసమా, భోగములను
సద్యోదళత్కంజ, జఠరరోలంబస మ్మర్దసౌరభరజో, మర్దనముల
విరహిణీసంతాప, కరఖరజ్వరసము చ్ఛ్వసన సోష్ణసుగంధ, చాలనముల
చక్రవాకీమిథ, స్సంజల్పనావక్ర చక్రపక్షోత్క్షేప, సంభ్రమముల

గీ. పాంథగూఢోద్భధకిమ్ములాంచు, బహువిహంగపక్షవిక్షేప నిష్ఠ్యూత, పల్లవాగ్ర
తుహినపరిరంభ సంరంభ, ధూర్వహములు గంధవహములు జగమెల్ల, గల
యనలమే. ౨౧౧

మ. అమలాహర్ముఖ యోగతారకరహ, స్యాభ్యాసియై చక్రచం
క్రమనాడీకల నాభియోగములఁజొ, క్కంగానధోవక్త్రతా
కమలంబుల్ దలలెత్తి విచ్చెనదియూఁ, గాదేనిసర్వార్ణనం
క్రమమున్ హాస సుఖోపలబ్ధియుర, సోత్కట్యంబు నాటిల్లునే. ౨౧౨

చ. పగలుసమాగమం బధిక, పాతకమందురు పెద్దలెల్లనీ
మగనిస్వభావ మట్టిదది, మానఁడుసీయని కన్నుమూసెనా
దొంగముకుళించె నౌనదిప్ర, దోషసమాగమ మన్నబంటునీ
మగడవు గాదొయుంచుననగు, మాడ్కి నిదావికసించెఁ దమ్మియున్. ౨౧౩

గీ. దివికిఁ దేజంబుతమరయిన, భువికిమేము రాజనందన గృహరాజ, రంజనముల
లరమెకావునననోన్యస్య, దైన్యమెట్లు తప్పుచనుమహాద్రినుడుదీప, తతులుమాసే.

సీ. కలకంఠకలకంఠ కాకలీకాహళా రవహాళాహాళికలు, త్సవము నెఱప
సితగరుచ్ఛ్రేంకార, తతభేరి కాధ్వనుల్ భృంగగానములతో, బెరసి మెరయ
శుకముఖద్విజకోటి, శూక్తికోశవాల మవిరతోత్సవముగా, నందగింప
మాలతీమల్లికా, మహితవల్లీవధూ కుసుమోత్కరము సేస, కొమరుఁజెల్వ
గీ. చక్రవాక కరగ్రహో, త్సాహవేళ నెదురుకోలకుఁ జనుదెంచు, నెడనమూల్య
నవదుకూలోల్లభము లెత్తి, నారవంగదిశలు దెలివొందఁ దూరుపు, తెల్లవఱ్ఱె.
చ. కువలయమాక్రమించియరి, కోటులనెల్ల దృణీకరించి కా
లవశతఁ దొంటిరాజు లెడ, లంగినినుండొకఁ డేలవచ్చుచో
నవతరహాట కధ్వజము, పాటిరసా బ్రధమాంశువొప్పను
త్సవమణి తోరణంబులన, సాగెని తూరుపు టెఱ్ఱచాలికల్. తి.ఆ.

—* ప్రాతఃకాలము. *—

సీ. ప్రబలీకృద్ధ్వాంత, పంక్తికంఠాన్వయో న్మూలనశ్రీరామ, మూర్తియనగ
దినరాత్రవిధవిధూ, ద్దీప్తలింగాకృతి జ్వాలమాలాకృతి, స్తంభమనఁగ
భువనత్రయీయజ్ఞ, పూర్ణాహుతీకృత ఙమమాత్ర జపకుండా, చార్యుడనఁగ
విబుధలోకధురీణ, విస్ఫురత్సైధాగ్ర ఘటితదీప్యద్రత్న, కలశమనఁగ
గీ. హరిహరిత్కామినీకుచా, తరచిరత్న రత్నరుచకప్రభావ్యాప్తి, రహిఁవహించి
మించుతొలిమించు గములరా, ణించునించు చండకరుఁడెక్కెఁ దూరపు, కొండకొనల

సీ. జేజేలరారాణి, చికిలికెంపులదండ గాలినెచ్చెలికల్కి, కేలుదమ్మి
జమునియిల్లాలిదా, సనపుఁబువ్వులగుత్తి తొలివేల్పు చెలిఁబసచెం, దొవలబంతి
మున్నీటిగాబోటి, మొనగోటిగోరింట పమ్మైరనవరాల, బరిణెలక్క
జక్కులరేకొమ్మ, సందిటిబంతులు ముక్కంటి ప్రోయాలి, మోవితేనె
గీ. గానిజిగురెండగాదనఁ, గాజగమ్ము దరుణకిరణారుణారుణ, సరణిఁదనరి
హరిదఖేశపురీసర, ప్రాంగణములు గలయ బాలాతపచ్ఛాయ, లలమె దెసల.
ఉ॥ అప్పుడు జాగరారుణక, టాక్షములాతుల మీఁదఁ జెందొవల్
గప్పఁగవప్ప డంతుకలు, గంతునిశాత విపాఠఝాటముల్
దుప్పలుడుల్చు వాఁడురవి, తొయ్యలులీతనిఁ జూడజాలరో
యుప్పరమెత్తె రమ్మసను, యోచితమాతల తాళపత్రముల్. శ్రీగ

క. తలవాకిలిఁ దియ్యకుఁడీ, తలసోరణ గండ్లవెంటఁ, దళుకుల ఝళుకుల్
తులకించెను కనిపెట్టుఁడు, తలకెదర రవివేణులెట్లు, తాళోదరమ్మా. ౨౨౧
ఉ. మారునికోనలో ననఁదు, మరుదౌవడిగ్గియ చొంతఁగాల్యమాల్
గామినులాచరించెదరు, గాతమటంచన నెట్టకేలకుఁ
భామినులల్ల నల్లవిరి, పాన్పులడిగ్గిల తాళపత్రముల్
గోమలులూనిఁ గంబిడఁగఁ, గొందలముల్ సవరించి మెల్లనన్. ౨౨౨
క. ఆరామమధ్య దీర్ఘిక, నారాములు గాల్యకృత్య, మాన్పుచుఁగాని
శ్రీరామాహృదయేశకృ, పారామతవలనుశ్రేము, మందెదమునుచున్. ౨౨౩
క. కల్పములై నిమిషములా, కల్పములై నవమృగాల, కాండములతిసం
కల్పములై దినములుదృణ, కల్పములై జీవనములు, గడునా జొచ్చెన్,
క. అనియీకథ వినిపించిన, వినిపానులు గుహునిమీఁది, వృత్తాంతంబున్
వినవలతు మానతీవే, యనియడిగిన సూతుఁడిట్టు, లనియె మునులకున్.

——* ఆశ్వాసాంతము. *——

శా. బాహాసాధ సుఖౌఘలంభ సుభగం, భావైక విస్రంభ హా
రాహీరాడహి భూధరాష్ట కలభ, ప్రస్తావ నేచ్ఛాపము
త్సాహక్షోణి తలాధిరాజ్య లసనా, సంరంభ గంభీస
న్నాహోపాహస విక్రమార్క జయసం, ధాకాళి దానానుజా. ౨౨౪
క. ధాటీరా హుత్త్వరట, ఘోటీరింఖాగ్ర దళద, కుంఠితకంఠజ
శ్మాటీపరి పాటీకల, నాటీకిత పుష్కరాంబ, రాఖ్యశ్లాఘా. ౨౨౫
తరళ. రాజరాజ విభవ ఖచర, రాజతేజ ముఖజిత్సాం
భోజభోజ చతురగుణస, మాజమాజ సుందరా
రాజరాజ దతులకీర్తి, భ్రాజభూజ నాప్తగో
రాజరాజ మానధర్మ, రామచంద్ర నందనా. ౨౨౬

గద్యం.

ఇతి శ్రీమదుభయ భాషారసజ్ఞ ...జ్ఞాగ్ర వృశ్చనాట కాలంకార
గ్రన్థాన్ధ్రప్రబన్ధ బన్ధుర కవితానిబన్ధన శ్రీమద్వేము నారాధ్య
వంశపయః పారావార రాకా సుధాకర (ములుగు) శ్రీ
పాపయారాధ్య విరచితంబగు సరసహృదయానంద
రంజనంబగు మహాప్రబన్ధంబు నందు
తృతీయాశ్వాసము.

# సరసహృదయానురంజనము.

## చతుర్థాశ్వాసము.





రాజరాజ వైభవ !

రారా జద్వైరి మౌళి, రాజన్య యశ

స్సారసమద గజనిహత

కూర్మిరా ! సుగుణాభి రామ ! కుశలవ రామా ! ౧

తే. గీ. అవధరింపుము విరిబోణు, లమృతవల్లి దేవవల్లులమవిలోనఁ, దెలిపియాని
వలపు బుగులును బొగలుట, దెలసితల్లి యనుఁగు సకినంపి తోడితె, మ్మనుచుఁ బలికె. ౨

## —* గౌరీ పూజ. *—

ఉ. అవ్విరిబోఁడి వోయికమ, లాత్ములఁగన్గొని ప్రేమఁదెల్పి యో
జన్వనలార! మీజనని, సాగరనందని తండ్రిసన్నిధిన్
వచ్చ్వులనున్న నన్నుఁగను, దమ్ములసైగలఁ బిల్చిదండయ
క్కవ్వపుఁగొండ దాఁటివినఁ, గాఁజనఁగావలె నన్నవచ్చితిన్. ౩

శా. గౌరీపూజను వేళయయ్యెఁ డడయం, గారాదు మీతోడిక
న్యారత్నంబులు గూడికుంకుమహరి, ద్రామంత్ర శాస్త్రాజ్ఞలై
మీరాకగ్గని పెట్టియుండిరిఁక నే, మ్మీబూజ నల్సల్పఁగా
రారమ్మాయని తోడితెమ్మనియెగా, రానన్ప దుండింటికిన్. ౪

క. రారమ్మా జాగేటికి, లేరమ్మా తల్లిమిమ్ము, లీలావతులా
రా!రమ్మని నన్నంపె విచారిమ్మింక యేలకోర్కె, సఫలంబాయెన్, ౫

మ. అనిసన్ మేనులు జెమ్మరింప జలజా, స్యల్గూర్మి రట్టయ్యెసం
చనిసా పత్రపలై పెనఁగుసడన, యూర్నలల్ వెలుఁగొందియో

యనుమానమ్ముల నేమికొండ పాడనై, యభ్రింక షంబైనమా
ఘనవాంఛాస్థితి ముజ్జగంబెఱుఁగుశం, కాతంక మింకేటికిన్. ౬

చ. అదియునుగాక మీరుహృద, యాంతరహాస్యర హాస్యగోపనా
స్పదచతు రత్వసంపదఁ, బ్రశస్తికినెక్కిన వారలాటమె
ల్లిదమొకొ బేరజంపుసట, లేనిది తెల్లము చాలుఁచాలుపో
పదపదరమ్మ సిగ్గుపడ, భావ్యమె భవ్యమె తల్లిపట్టులన్. ౭

తే. గీ. తానుచిర్యాభత లైవిరు, ల్దాల్చినేఁడు కలిమియిల్లాలురతనఁపు, గద్దెమీదఁ
గూరుచున్నది తిన్నెపై, గాఁనిలిపి పూజకెడలేదు లేరమ్మ, పోలతులార. ౮

మ. జగదీశుండగు శౌరిభాగవతపుం, జంబుల్ దనుం గొల్వనిం
పుగ వేడంతి పురంబులోపలరమా, పూర్ణేందు బింబాస్యతో
భగవత్పూర్చన మాచరించి భుజియిం, పంగాచియుండెన్ సహిం
పఁగరాదిచ్చట జాగులేవ గదర, మ్మాయింటికిన్ బోవఁగన్. ౯

తే. గీ. తల్లిగండ్రిలుమీకునై, తల్లులార! యెమరెమరుజూచుచున్నారి, దేమిజాగు
పోవుదమురమ్మంటంచును, బుజ్జగించి, కరములాలించి బోటియు, ల్కమ్మకొనుచు.

క. నైదండ లొండొరులతోఁ, గైదండలు గీలుకొల్పి, కదలుటవలరా
వేదండము లొండొరుశుం, డాదండము లలమికదలు, టయగాఁ దోచెన్.

సీ. ప్రతిపదోపన్యాస, భావసంకోచంబు, నడలలో నడుములలో నాటుకొనఁగ
ఇష్టసందర్శనో, త్కంఠితమందాత్మంబు, తలఁపులో వలపులోఁ దారసిలఁగ
ప్రకటానురాగవి, భ్రమణలీలాదృష్టి, చెలువుపైఁ జెలువుపైఁ, జెంగలింప
నధికానుకంపాను, యాయితల్ పూబోండ్లు, చెలిమితో బలిమితో జగురుగొనఁగ

తే. గీ. విరహగహనావ గాహనో, ద్విగ్నహృదయ లగుచు నగుచుఁ జెలుల్ రాగ, నలుకు కులుకు
బెళుకు దులకించు నాయొమెలు పెం, పిసలు గూయ నతి వలవ్వేళ నఘుడెంచి, రంతి పురికి ౧౨

చ. రతినఁపుఁ బావలంతజవ, రాండ్రిడనంఘ్రిలఁ దాల్చి వల్పెముల్
వితతకటీతటంబులబ, లించిమణీమయ నూత్నపీఠులం
దతివలు గూరుచుండశిర, సంటిరిబోండ్లు సుగంధతైలపి
ష్టశ్రుతఘన సారచందనప, టీరపరాగ పరాగచర్చలన్. ౧౩

సీ. కళుకుమేనిమి బిండియలఁదెచ్చి పన్నీట, జలకమార్చెననుంగు సకియ యొర్తు
జిలుఁగు బావిరాంచుపం చలమేని డడి యార్చి, కురులు క్రొమ్ముడి గొల్చెగొమ్మ యొర్తు
గళితంపు వలిపెంబు వెలిపట్టు పుట్టముల్, గట్టించె నెరజాణ కల్కి యొర్తు
యపరంజిసీటుజవ్వా, లలము బిక్కటంపుఁగం, చలను గీల్కొలిపెఁ బైదలి యొకర్తు
తే. గీ. శోభఘుమఘుమ వలపునె, క్కొనిన ధూపధూమములు గూర్చె ముసుగిడి, భామ యొర్తు
కుంకుమము దీర్చి తిలకము, ల్గుదురు పఱచి కన్నెలలంకరించిరి, కాంతలిట్లు

ఉ. అందెలుఁ గంకణంబులును, హారములున్ శశిపూలు రాగిడీల్
సందిటి దండలుంగ్రములు, జత్తులు నత్తులు ముక్కు ముంగరల్
గెందొవకు సంతసపుఁ, గీల్జడలున్ మగరాల కమ్మలుం
జందము లందముల్ దొలఁగ, జక్కరబోండ్ల నలంకరించిరన్. ౧౫

కం. మెలుగులు మలఁచిన తెఱఁగున గిరికొనుతళతళల హొయలు, గీల్కొను చెలువుం
చిరునలఁతియు లోఁజేవం గరకరి యిసుమంత లేక, కన్నెలమిన్నల్. ౧౬

సీ. సముదితస్మిత పూర్ణ, సామరస్యములచే, వదన పాండిమముల, వ్వాలనడంచి
పలుమారు బాలెపెత్తు, వలఁపుఁ జెమ్మటసోన, పాదసంచారదం, భమునఁగప్పి
మాటిమాటికి గ్రమ్మును మతలోని పరాకు, సకులయాగమనవాం, ఛలన గ్రమ్మి
జాగరారుణనేత్ర, చకచకల్ స్వాశ్రితా, త్యనురాగ కైతవో, ద్ధతుల మాటి
తే. గీ. నద్ధ పంచాయు ధోద్దీప నమునఁ బాడము భావములు దత్తదనుభూప; భావనమున
మాటుపరచుచు నంతంత, మమత బెనఁగు జనకు పంచాయుధునిఁ జేరఁ, జనిరి చెలులు. ౧౭

చం. ఎదురుగ నేగి సందిళుల, నెత్తి శిరమ్ములు మూరుకొంచుఁ బే
రెదఁ గదియించి శౌరియుమ, నేలినతల్లులు వీరటంచు సం
ముదమొదలిర్పఁ గల్మి చెలి, ముందిట డించినఁ జేరఁబిల్చియు
మ్మదవతియూనుపీఠముల, మన్ననసేయుచుఁ గారవింపఁగన్. ౧౮

తే. గీ. తమమనమ్ముననఁ బొరలును, ద్దానువిరహ వేదనాభరమిందిరా, విష్ణువులకు
దెలియమిగ నెంచిహర్షించి, రెలమి చెలులు వారిసార్వజ్ఞ మెఱుగంగ నేర రైరి ౧౯

తే. గీ. చిఱుతరత సంవుగద్దియల్, చేడెలిడఁగఁ దల్లికిరుపార్శ్వములనిచ్చి, తత్పరతను
బుహరుని రాణి సంకల్ప, పూర్వకముగఁ బూజఁ జేసిరి యపరంజి, పూలఁ
జెలులు. ౨౦

సీ. ధ్యాన మానందకం, దస్ఫురజ్యోతికి, నావాహనముగు హే, నంతమణికి
సింహాస సమ్మునా, తీ స్వరూపిణికిని నర్ఘ్యపాద్యములు బ్ర, హ్మాదిజనని
కభిషేకమఖిలాబ్జ, జాండవిగ్రహకును, గంధపుష్పాక్షతల్, గనకభూణికి
ధూపదీపములు సింజధుర వైరివాహకుర సరసాన్నములునా, బ్రహ్మాండధాత్రి

తే. గీ. కనుమ సద్భక్తిఁ బూజించి, వినుతిజేసి యవతల తాంబూల నీరాజ, నా
దులొసఁగి
సప్రదక్షిణముగ మ్రొక్కి, జననితోడనక్షతలుదాల్చి శౌదల, లంతఁజెలులు. ౨౧

తే. గీ. పూర్ణభోగోపలబ్ధిన, పూర్వముదముఁగాంచికరుణించెనాబ్రసా, దించెగౌరి
యంతలో దివ్య పటహదు, ర్దాంతరవము గప్పుకొనె నప్పరపు గడల్, గ్ర
మ్మికొనుచు ౨౨

సీ. నిఖిలాత్మ భావనా, నిర్నిద్రసర్నిమే, షాభ్యాసు లైవబ్రహ్మర్షినరులు
వ్యంజనా సూచిత, స్వస్వరూప బ్రహ్మ, శోధనా మృతరస, శ్రుతిచయంబు
జడచిద్వి వేదనా, సిద్ధాంత సులాస్య, చతురాప్స రొంగనా, శతశతములు
బ్రహ్మాది సంపిద్వి, రక్త చింతా శ్రాంత, పరిణతప్రప మధసిం, ధుర గణంబు

తే. గీ. లలమదారాపథంబెల్ల, ననుపమానదివ్యశోభామ చర్చికల్ దీటుకొనఁగ
బహుసహస్రాభ్ర మణికాంతి, బర్వె నవఁగఁ బ్రదమ చిజ్జ్యోతి సాకార, భరిత
మయ్యె ౨౩

చం. ఉపనిష దుగనా జనము, లూడిగముల్ పచరింప దుంపసి
గఁపుఁ బలుకత్తలాని పయి, కారణ పల్యయ నంబమచ్చి యీఁ
గపులుల సృష్టి చెక్కడఁపు గండువలీసుఖ లీన మూనిచా
కకుపుధు ముకుఁజొకాటఁపుని, గారమలీను చెలంగు లీలలన్. ౨౪

శా. స్వాత్మజ్యోతివెలుంగఁ దా నెడలిస్వ, స్వానంద వాగాసిలో
స్వాత్మే శుంభాడఁగాంచి శ్రీనగరిత, త్స్వాంక స్థితింగాంచిన
ర్వాత్మాఖండనిజ స్వరూపము త్రిఖండాయత్త మాగారివి
శ్వాత్మా సోదరుశౌరిఁ గాంచుటనునై, యచ్చోటికే తేరఁగన్. ౨౫

మ. అఖిలాండేశ్వరి నాగలోకవినికరం, బాత్ముండు బ్రహ్మాత్మభూ
ముఖపుత్త్రావళితో మరుద్గణముతో, నవ్యక్తర్షి సంఘంబుతో
నిఖిలస్త్రీపరివారముల్గొలువఁగా, నిర్ణిద్ర గంభీరతా
ముఖవస్ప్రక్రియ దివ్యదుందుభితతుల్, మ్రోయంగ సముత్సాహియై. ౨౬

ఉ. అండజ వాహనంబునవ్వ, దంతర దంతుర మోదవారియొం
డొండఁదరంగముల్దుముక, నుజ్జ్వలదివ్య చమూసహస్రము
ద్దండతఁ జుట్టుముంగొలువఁ, దామరిసాక్షుఁడు శంభురాణికిం
గొండలు నాభుజంబులవి, కుంతతఁదొంగ వికుంఠ వీధులన్. ౨౭

గీ. ఎదురుగా నేగుటయునిండి, శేషరాక కలరిశాకాశ శిజ్యోత్స్న ననుకరించు
మన్దహాసంబు నెమ్మోము, నన్దగింప నిన్దుధరురాణి నిరుపమా, నన్దమొందె.

సీ. భస్మత్రిపుండ్రాంక, ఫాలభాగములతో సరిలేనిరుద్రాక్ష, సరులతోడఁ
బంచాక్షరీమంత్ర, పారాయణములతో శివనామచింతనో, త్సవముతోడ
శివశక్తిసామర, స్యవివేకకలనతో శైవసిద్ధాంతని, శ్చయముతోడ
లింగాంగ సంబాధ, లీలావిభూతితో నిశ్చలధ్యానని, ర్ణీతితోడ

గీ శంభుసారూప్యధారులై, సంచరించు ప్రమథులతివేలసంఖ్యులై, భవునిరాణిఁ
గలసి యెదురేగి వచ్చి వాకిళ్ళు, రాంగణము లెల్లఁ గ్రమ్మ కైలాస పురవరాంగ,
ణము లయ్యె. ౨౮

గీ. అట్టియేకాత్మ్యవస్తుద్వ, మైకమత్య మతితరానన్దకరమయ్యె, నఖిలమునకుఁ
బుష్పవర్షంబులురివెన, బ్బురముగాగ జయజయధ్వనులపుష్పాక, సమ్ముగ్రమ్మె.

ఉ. శౌరిదృగబ్జ మాలికలు, శాంకరి పైఁగలయంగఁ బన్వచో
శౌరిదృగుత్ప లంబులును, గంజదళాక్షునిఁ గప్పె నొండొరున్
గౌరవమింత యింతయనఁ గాంబనియేమొక తేజమిన్వరై
వారనివేద శాస్త్రముల, నంతముఖంబుల మ్రోయుచుండగదా. ౩౦

గీ. ఏమిచెప్పంగవచ్చును, హేమరాణి నలిననేత్రుని గాంచియు, నందబాష్ప
పూర్ణయగుటయునీహార, పూర్ణ చంద్రకోటిసంకాశమైమోము, కొమరుదనరె

ఆ. ఇల్లువెడికొండ, విల్లుబంగరుకొండ బట్టినట్టిశివుని, జెట్టబట్టి
నట్టియన్నపూర్ణ, యఖిలలోకేశ్వరి కన్నులింటిసిరులఁ, గాంచిపొంగె. ౩౩

ఉ. కన్నదియెన్నఁడో తొలుతఁ, గన్నదియెవ్వరొ మున్నెయింగరీ
యన్నయుఁ జెల్లెలుం బాడము, టాసిగఁ బ్రోది గణించుమక్కువన్

మున్నుఖగేంద్ర వాహమును, మ్రోలనె దివ్యమృగేంద్ర వాహముల్
జెన్నలరంగ వచ్చిరిలు, సేరఁగస్వస్వ చమూసమేతులై. ౩౪

చ. ఖగపతి ధోరణమ్ముడిగి, కాంచనచేలుఁడు చేయివీచిరల్
యుగపదు పస్థితిల్ నిలచె, యూధపయూధ సనాథయూథినీ
యుగళము దత్ప్రసన్నశర, శోత్కరముల్ జరిచారికాతతుల్
బాగడుచు వేల సంఖ్యలుగఁ, బాల్చిరిశ్రీభగవత్కృపాప్తిచే. ౩౫

క. పట్టిరి వెలిఁ గొడుగులుభువి జుట్టెయదుగడుగునుడుగు, జొంపము వెన్నుం
డిట్టలముగఁ జేయొసఁగఁగ, గట్టులవిలుకానిరాణి, కడుమోదమునన్. ౩౬

క. కంఠీరవంబుడిగియు త్కంఠన్ రతనంపుఁబాదు, కలుచెలులిడనై
కుంఠపుర భాగవతకల, కంఠులునివ్వాళు లిడఁగఁ, గదుణాగనుచున్. ౩౭

సీ. గంధర్వ కామినీ, గణము వీణలుమీటఁ గిన్నరాంగనలసం, గీతములయ
సురసతీచయముచా, మరముఖుల్లునవేయ విద్యాధరాంగ, ల్వినుతిసేయ
యమికామినులుహారి, ద్రాక్షుతంబులుసల్ల గరుడకాంతలుబరా, బరులుసేయ
సివ్యాప్సరలుసము, ద్దీప్తినాట్యముసల్ప యక్షభామినులుకో, లాటమాడఁ,

గీ. దల్లిసద్భక్తజనకల్ప, వల్లిత్రిపుర సుందరీదేవిగో, విందమందిరమున
నడుచుమనునల్లనల్లనఁ, గడచివచ్చియంతఃపురముఁ బ్రవేశించె, సతిముదమున.

సీ. పసపుకుంకుమనిండు, పళ్లెరంబులతోడఁ బక్వఫలపరం, పరలతోడ
ఘనసారసురభిచం, దనసుగంధములతో నతిభవ్యకరణు, భాక్షుతలతోడ
బహుళకల్పద్రుమ, ప్రసవమాలికలతో రమణీయధూపధూ, మములతోడ
బహుదీపసాహస్ర, భరితపాత్రలతోడ ననులామృతోపహా, రములతోడ

గీ. గలిమిజవరాలుసిరులిచ్చు, గరితతనకునాడుబిడ్డజగన్మాత, యెరుగుదెంచు
వార్తవిని యభిముఖి, యనుచు వచ్చెఁబుణ్య సతులువేవేలు గొల్వఁగ, సం
తసమున. ౩౯

క. అన్యోన్యపరీరంభణ మాన్యోన్యస్మితవిలోక, మన్యోన్యముదం
బన్యోన్య హాస్యచతురో పన్యాసంబుమరు రమను, బరఁగెనడపడిన్. ౪౦

ఉ. అంతట దంపతుల్ రమయు, నంబుజనాభుఁడు శంభురాణిన
భ్యంతర మందిరంబునక, పారములౌ నుపచారముల్ వధూ
సంతతు లాచరింపఁగని, చక్కఁగనేగి మహార్హ పీఠిపై
నెంతయు భక్తినిల్పిసద, భీష్టముచేకురఁ జట్టునిల్పుచున్. ౪౧

క. రతిభోగమలాస్త్రేడుభా రతితో గమలాసనుండు, రహిఁగ్రొక్కంగా
సతివేడ్కఁ దేవపల్లీ యుతమైతానమృతనల్లి, యునుమొక్కంగన్. ౪౨

ఉ. కన్నుల నాదరింపుచున, ఖండతదీవన లిచ్చుచుంగృప
న్మన్నన సేయుచున్ జనువు, మాటలఁదేల్చుచు వారివారిన
త్యున్నతి గారవించితన, కూరనెనిల్చిన ముద్దుకన్నెలం
జెన్నలరారఁ గౌగిళులు, జేరిచియంకము లందునిల్పుచున్. ౪౩

క. చెక్కులునొక్కుచుఁ గౌగిట, మక్కువనొత్తుచునుజాల, మాలిమిఁగొనుచే
జక్కెరబొమ్మల నెక్కువ, కక్కసపుంజనువుఁగొల్పి, కన్నులసగుచున్. ౪౪

శా. అన్నా! కన్నెలు మాకుమురునకునీ, దైయన్న నారయ్యనే
మున్నెన్నండును సిల్లియుఁగనిదియే, మున్వెన్న యల్లైనసం
పన్నంబయ్యెడు గాదెయింత కనఁబై, పైనంత భాగ్యంబుమా
కున్నె! యంచనుశౌరి పల్కువినుచున్, యోగాంత రవ్యాజతన్. ౪౫

గీ. మాట మఱపించి యౌచిత్య, మహిత వృత్తి నున్న యెడసామ యికులుసా, హానినాద
భాసురముగనుభోజనా, వసరమనుచు విన్నవించినఁబతికన్న, సన్నరమయు.

గీ. తానియోగింపఁజేటికల్, తదనుమతిని, మత్తియఁపుటారతులు దెచ్చి, ముందు నిలువ
నీశ్వరేశ్వరియభ్యంగ, మిచ్చగించి కదలెసభయెల్లసాచితీ, కలనమసలె. ౪౬

సీ. గంధతైలపుసునొక్క తేదేవితలయంటె చెలియోర్తుకలపంపు,నలుగువిడియె
గొజ్జంగి నీటితో, మజ్జనంబిడె నోర్తుతడపుచేఁ దడియార్చెఁ, దరుణి యోర్తు
గళితంపు వెలిపట్టు, గట్టించె సకియోర్తు పొపైన ధూపమ, బ్బించెనోర్తు
పట్టు కంచల గబ్బి, పాలిండ్లనిడెనోర్తు నిఖల భూషలు మేన, నినచె నోర్తు

గీ. రత్నసింహాసనముఁ బెట్టె, రమణియోర్తు ఇాపుటపరంజిపళ్ళెరం,బిడియెనోర్తు
శీతతోదకములగిండి, జేర్చెనోర్తు విమలజళత్రాళి వృత్తంబు,విసరెనోర్తు ౪౭

కం. కమలా కమలా తుసుధా కమ లాసను లొక్క మొగిని, గన క్రాద్రి ధనుః
కమలాక్షసన్నిధిరతీ కమల స్త్రీల తోడఁ బంక్తి, గలసి యిరుగడన్ ౪౮

మ. బహు సాహస్రసు వాసినీ సహితులై, భర్తోక్త సింహాసనో
ద్వహులై యుండఁగ నిత్యతృప్తిక సుధాం, ధఃపాయ సాపూపసూ

పహావిర్భ్యాజన రంజనంబు గనుపి, శక్తిభక్తిసద్దింవిర
స్వహాసంసూచక పాచకవ్రజమునా నాపస్య సంధాయి గన్. ౯౦
వ. అట్టి సమయంబున, నశేష శేష భావపర్య వసన్నాంబగు, నిఖిల బ్రహ్మాపి పరివారమ్ములత్తో, లక్ష్మీ నాథాయణు లిరువురు, హరి చందనాది కలపంబు, బొసంగి, హారిద్రా కాశ్మీ రమ్ములర్పించి, సాక్షత్రతపసూన మాత్ర పుష్పమ్ములిడి, కాత్యాయి నింబ్రార్థించి, తదనుగ్రహ ప్రాప్త పూర్ణానంద పాత్రులై, సపరివారంబుగ, భుజింపఁజేసి తదనుమతిన్ స్వస్వపీఠాధిరోహణంబుల నానందించు, నమృతతర సాస్వాద నోల్లాస సముత్సాహులై, భుజించిరి, పరాశక్తియుఁగర పాదప్రక్షాళనంబు లొనర్చి, వీటికా చర్వణంబున ఘుమఘుమిత మృగమదల వంగైలాసు గంధంబులు, సభా సదులకుఁ బ్రసాద గంధంబుల నుగ్రహింప, మందారపల్లవా నల్ప తల్పంబున, సుఖాసీనయై, కరకంకణ ఝణత్కారంబులు,దిక్కులంబిక్కటిల్ల, మృదులపలదవ్యజనంబులులీచుచు, బడపల్లవమ్ములొత్తుచు, భూషణమ్ములచిక్కులుసవరించుచు, నపరిమితదేవభామినీజనమ్ములుగొలువ, గొలువై, యున్న, యవసరంబున. ౯౧
క. భుజియించియంత, శుచియై గజవరముండపునకుదివ్య, గంధాంకసుమ
వ్రజమాల్యా లంకృతుఁడై విజయోల్లాసముగ సభకు, విచ్చేయంగన్. ౯౨
మ. కలవారెల్లఁ గృతాహ్నిక కృత్యులయి, యగ్రప్రౌఢి సన్యోన్యసం
కలనావృత్తుల సేగుదెంచిసభ వే, డ్కంబిబిక్కటిల్లగను
జ్వలసంరంభ పయోధిమంద నపదా, శ్చర్యాను సంధానమై
కలరానంబుల నొప్పవచ్చదరుసాం, గంబైన మోదంబునన్. ౯౩
మ. హరియిల్లాలు సువాసినీజనముచే, లైలక్షలైకోటులై
పరివేష్టింపఁగ వెంటవెంట సొబగుం, బట్టపు రాణుల్వారెల్
సరసీజాక్షులు భారతీరతులురా, సంపూర్ణ శృంగారమూ
ర్తిరసోద్వృత్తి సభాగ్రభాగమునకే, తెంచెన్ సముత్సాహతన్. ౯౪
గీ. వలపుజిగురింపశ్రీదేవి, వనజనాభు దండరతిదేవిపుష్పకో దండుదండ
శారదాదేవిపంకజా, సనునిదండ నిలిచిరెల్లనుఁదగుచోట్ల, నిలచిరపుడు. ౯౫
క. జననీజనకులయనుమతిఁ గనుసన్నలగట్టులిల్లు, కామినిచెంతన్
జననెత్తిఁగి యమృతవల్లియు నొనరఁగసౌంధర్యవల్లి, యుచుఁకల్చిరొగిన్. ౯౬

——* మహర్షులు వైకుంఠమునకు విచ్చేయుట. *——

శా. శాలంకాయన గౌతమాత్రికణభు, క్సానంద వాశిష్ఠజా
బాలిత్యాగస రైభ్యకశ్యపభర, ద్వాజాది మౌనుల్ త్రిలో
కాలంబంబగు గౌకోర్కొఁగనికా, ర్యాలోచనం బెంచిలో
కాలోకంబులు దాటివచ్చిరిమహా, ర్ఘాంబైన వైకుంఠమున్. ౫౮
క. ఫణిశాయిమునులరాకలు, ఫణిహారులుదెల్పవారి, పటుతరవాచా
ఫణితివిని పిలువనంపెను, ఫణిభూషణు సాధ్వికడకుఁ, బటుమోదమునన్.
క. నాగాయుణి నారాయణు, లారాధింపంగవార, లయ్యైదువురని
త్యాయూథిఁగొల్చి యుండిరి, గౌరవసతినుతులవారి, కరుణల్గనుచున్. ౫౯

——* కుమారుని వివాహ ప్రయత్నము. *——

ఉ. అయ్యెడభృవా విలాసముల, నాసభికారవ మోసరించిమో
మెయ్యరమార మాధిపుల, మోలముత్రివ్వ సహాసశోభలన్
దియ్యముగొల్చుచున్ జనవు, దెల్పుచుశాంకరి పల్కెనన్న! యే
మయ్యః భఃత్సకాశేషమున, సాంజలినై యొకకోర్కెఁ దెల్పెదన్. ౬౦
గీ. సకలగుణశేఖ శాస్థాన, చక్రవర్తి వితరణగుణంబటనీకు, విశదపఱచు
దానఁగానటులయ్యునే, తాదృగర్థ శూచనమున స్వతంత్రిత, బారవుఁ గంటి.
ఆ. మాకుమారయ్యకునుమీకు, నూర్తెలమృత, వల్లిశౌండర్యవల్లుల, వాంఛజేసి
యమగఁదలపోసివచ్చితి, రయ్యమీకుదంపతులు పెండ్లిసేయఁగఁ దగినవారు.
ఉ. తల్లినెఱుఁగ నట్టులనె, తండ్రినెఱుంగను పుట్టినింటిపే
రెల్లయునీవకాని మఱి, యెద్దియు లేనిది నీవెఱుఁగవే
తెల్లమునాడు భాగ్యమున, దేవుఁడు చేసిన కార్యసిద్ధినా
యుల్లము పల్లవిఃపఁగరు ణోదధి, బిడ్డలనివ్వఁగా, దగున్. ౬౩
ఆ. ఏఁడ్లకెట్టులైన, యీనన్నుగురియించి వఃఅఁద్రైయెః భుజగ, మండనుఁడు
కార్యఘటనకేమొ, కడువిదగ్ధవుగాన పోయిరమ్మటంచు, బుచ్చెనన్ను. ౬౪
క. నామాటజిన్నపుచ్చక మోమోటము బెంచిమనుత, మొనయుగఁ దగమా
స్వామినిగార్హస్వ్యశుభో ద్ధామునిగాసేయనగును, దారప్రార్థిన్. ౬౫
ఉ ఎక్కువభోగ భాగ్యముల, కేమికొఱంత తదర్థమైపగన్
దక్కకునన్ను నిచ్చుకతి, తల్లియుదండ్రియు నేమిజూచిరో

మ్రొక్కులపేర టాలనయి, ముజ్జగమేలితి నేటిపాకికిన్
దక్కవి కేమి హామకయి, డండనుబంగరుకొండ యొుడఁగన్. ౬౬
క. సీతోవియ్యంబాడఁగ జేతోమోదంబుకడలి, చెలువునఁబొంగన్
బ్రీతిపడి వేడిటినిసి చేతివిసామేలు తెలియఁ, జిత్తములోనన్. ౬౭
వ. అనిపలికిన. ౬౮
చ. పురహర భామినీవచన, పూర్ణతమెచ్చి సభాసదుల్ మహే
శ్వరిహృదయంబుఁ గాంచితిమి, వచ్చుటసంప్రతి పన్నమయ్యెము
దరధరు దాప్తవత్సలుఁడు, నాయముదప్ప త్రోడబుట్టువుగా
గరిమకుఁ దావలంబనెను, గానిమఱొండు దలంపఁడేమియున్. ౬౯
చ. అదియటులుండె వారితెఱ, గంతయుఁ దెల్ల మొకండుకోపియున్
బటపడివేళ్లొకండు బహు, భక్షి యొకండు దిగంబరుండుభూ
విహుతులుక్షోభావలిట్లుపెను, వేమరుమామ మొఱంగిమెట్టులీ
సుదతులనట్టి కాఁపురముఁ, జొచ్చెదునన్ దలపోయుతండ్రియున్. ౭౦
చ. సిరులకు నాలవాలముబ్రి, సిద్ధికిమూలము, శేషసద్గుణా
కరమణి సర్వమంగళజ, గన్నతయామె భరించునట్టికాఁ
పురమగు యన్నిలంతలకు, భోగములందు కొఱంతలేదుతా
మగలిరి జొంపమైవిబుధ, మంజులమై జగమెచ్చఁ గాంచదే. ౭౧
గీ. కలిమివేముల కేమియు, కంజనాభునకును సైదోడుగాదె, నందనులకుఁ
గన్నియలనీకటీరుసే, వెన్న శివ్వఁ దలఁచెనేనియుసిరికేమి, వెలితిగలదు. ౭౨
మ. అసహాయంబుగ ముజ్జగంబులభుజా, హంకార లీలాసము
ల్లసనప్రౌఢిఁ మన్నాక్రమించిసురపా, లప్రస్తుతుల్గొన్నయ
భ్రసమానుండు వరుండుగల్గఁగవధూ, భాగ్యంబు నాకువ్వఁగా
వశమేముల్విగి బోండ్లకన్నజగమ, బ్రాబొప్పఁ గైసేయదే. ౭౩
క. అనియనివారితవాచా వినియోగరహస్యకలన, పిహారించుసభా
జనులను రాకాహిమకర, ఘనదీధితు లౌనయఁగన్ను, గవఁగన్గొనుచున్.
చ. అచలధనుష్కుఁ డేలిమిగ, మైజలజాంబకుఁ డిట్లుపల్కునో
ఖచరనుతాను భావజ్ఞజ, గద్రమణీయము నాకెకాదునీ
వచనమునీకు సంతసము, వశ్యముసేయుట కించె వేఱెత
త్రృచురగుణాభిసంధిఫల, దాయకమున్నదె ముజ్జగంబులన్. ౭౪

చ. అతులకలా కలాపసము, దంచిత హారతనంబు హేమసం
గతమయికాంతిఁ జొప్పడిన, కైవడిసద్గుణ వాసనాసమం
చితమతి నీసపర్యలకుఁ, జిక్కకనుంట ప్రకాశమెద్దిని
న్నుతికిరణాగ్ర వర్తివిధి, శ్రీకరహస్త యుగంబుఁ గూర్పఁడే. ౨౬

క. కన్నియలఁగన్నవారలు, గన్నెఱఁగిజగంబుమెచ్చ, గలబాంధవసం
పన్నతఁ గోరెదరుగదా, భిన్నతులగువారుడాగి, యుందురెతల్లీ. ౨౭

ఉ. హాటక గర్భకోటులకు, సాగరమాగత మేరుచ్ఛాజగ
న్నాటకసూత్ర ధాత్రిశివి, నాయమెసన్నదుగర్భ భవన్నిరా
ఘాటమనోభిరామమున, గన్గొనరానిది యేడనీదయా
వాటికిఁబాత్ర భూతులక, వశ్యముసర్వ విభూతులంబికా. ౨౮

క. నీవాంఛితమున సిద్ధము, గావింపఁగ వశమెసర్వ, కారణమవ్వసం
భావించి పనులుగానుమొదల, లీవిధియిట్టుదని తెల్ప నెవ్వరుజగతిన్. ౨౯

ఉ. ఇంటికివచ్చి కన్నియల, నిమ్మనివేడిన దానవమ్మనీ
వంటిజగజ్జనిత్రికభి, వాంఛితసిద్ధికిఁ గానివానిదు
ష్కంటక జీవితంబువిత, గాఁదలఁతుర్ మరుమాట లేలనొ
పుంటికి నీము వాస్తికిని, బాల్పడియుండుముగాదె శాంకరీ. ౩౦

మ. గుణవంతు డభిమాన శాలిసమర, క్రూరాసురానీనిబ
ర్హణనిస్తంద్ర భుజాబలుండగు సుబ్రహ్మణ్యుఁ డల్లుండుగా
గణుతింపంగల దెట్టిమాంతరవరి, ప్రాకారంబు శైలాధ్రగ్రియా
గ్రణి గానెంచుచుఁ బట్టిచో సుతలనీ, గంగంట భాగ్యంబెకా ౩౧

గీ. అన్న ఇటులుండనిమ్మమా, యమ్మనీకుమోదమెుదఁగూర్చుకొంచెన్, ముజ్జగమున
నస్మదిష్టంబు గలదె యమ్మ, న్యాయంబు మనసు రంజిలివ నింపు మమ్మ యమ్మ, శ్రీడ
మఱకొమ్మ. ౩౨

మ. అనియంభోరుహపత్ర నేత్రుడు ఖిత, వ్యాహారముల్ సల్పియొ
య్యనదేవీసలిధంబున న్నెలకు నెయ్యంపుంగు మాకీదృశుల
ఘనకారుణ్యర సాబ్ధి నత్తకులనమా, స్కారంబుఁ జేయించెనె
క్కానువాత్సల్యంపు మేనయత్తవ్రసుభా, క్రోధుండ్రు వీరంచనెన్. ౩౩

## —* లక్ష్మీదేవి శివసంపదను నిందించుట. *—

గీ. ఇంత సంరంభ మాలించి, యిందువదన సారసాలాస సభికులా, శ్చర్యమంద
నెల్లవారలఁగనుగొంచు, నిట్టులనియె మృదుల వాచావిభూతిని, మ్రోలఁ దలిర్ప.

చ. సరిసరి యేటి మాటలిఁక చాలు సభాసదులార! వింటిరే
పరిణయబాంధవంబు సను, భావమటంచన వింద మిందునె
వ్వరుసున మాకు పార్వతికిని, భవ్యము భాగ్యము కొండమీదికాఁ
పురమది కొండగ్రిందిబలు, పోకలుమాయలి మున్నెఱుంగరే. ౮౧

సీ. ఏనాటివారలో, యెఱుఁగరించుక యుమా ప్రకృతివారలుగారు, పురుషులుగాని
గుణవంతులా కారు, గుఱుతు లేమియు లేవు బ్రహ్మవిద్వేషమ్ము, పట్టుగొమ్మ
జాతిమాలినవారు, సదసద్విలక్షణుల్ పరమమాంగళ్యసం, చరణపరులు
మానవం బెఱుఁగరు, మర్యాదలును లేవు దుస్సహాయులు జగ, ద్రోహకృతులు

గీ. వారితో బాంధవంబు బొత్తు, వసముగాదు తెలిసి కలియంగ రాదన్న, పలుకు వినమె
ఇట్టు కన్నెల నివ్వంగ, నిచ్చగించు మనసునకు నంత దాజోలి, మానుటొప్పు.

చ. భ్రమపడి రూఢు బిడ్డయని, పండుగపబ్బములన్ సువాసినీ
క్రమమునఁ బిల్వనంపుటయొ, కానుక నాఁడును లేదు బ్రాహ్మణ
ప్రమదకుఁ బచ్చుటక్షతలు, పైని కుటల్ దనపేర మ్రొక్కుకుం
టిమియుఁ ది బంధుభావమొక, డిందిసరాగము లిట్లుగల్గునే. ౮౨

గీ. అన్నియిటులుండనిమ్ము లి, య్యాపురాలు పెండ్లి పెద్దలతోఁ గూడఁ, బేర్మి మెఱయఁ
గొడుకుఁ గోడండ్ర కలిసియే, కొండ గుహలఁ జెలువుగ గృహ ప్రవేశమ్ము, సేయునొక్కొ. ౮౩

గీ. తాపసము గాని సత్వంబు, తలఁపరాదు రాజసము పేరుఁ జెప్పంగ, రాదు మున్నె
దిరాశ్రితుల చక్కదనమెన్న, నలవిగాదు త్రిపదులు చతుష్పదులుగారె, తెలసి చూడ. ౮౪

సీ. గజవర్ధనంబును, గజమర్ధనంబును భుజగసిక్షణమును, భుజగభూష
మంధకావనమంధ, కాపహారంబును వృషభసంహాతియును, వృషభగతియు
హరిణమారణమును, హరిణధారణమును గోపాలకత్వంబు, గోనికృతియు
సర్వాశాంసనం, బధ్వరాధ్వంసయు విశ్వపాలనమును, విశ్వహృతియు

గీ. గాగహారివిహారచర్యలి, క్కరణిఁ దనరి తలఁపనన్యోన్యవైరంబు, దాల్చుచుండు
నట్టివారలు విద్యాదకు, లగుటఁ గనఁగ బ్రహ్మసృష్టికిఁ బ్రతిసృష్టి, పగిది యయ్యె.

ఉ. కావునఁ బ్రాణవల్లభుని, ఖండితవాక్యము విన్నయంతనా
భాసము సంచరించెడినె, పంబిడకీరుచి తంబెఱుంగుఁడం
చీవిధిఁ దత్సభాసదుల, కిందిరతెల్పఁగ గోష్ఠియెల్లను
చ్చాపచ వాగ్విలాసమున, పండడిదందడి కొల్వునంతటన్. ౯౧
గీ. స్వామి సర్వజ్ఞుఁ డీశుఁడు, సాంబమూర్తి యీయ నాగత మెఱిఁగిమీ, రే గుఁ డనుచు
దమ్ముఁ బుట్టవలవన, త్రాపసేందుల్ లేకముఖముగనిలిచి కే, వెత్తికొనుచు.
శా. వాచారంభణమౌల్ వికారములు భా, వద్వైధ ముల్మానుఁడీ
వాచాతీతము నిర్వికారమఖిలా, ద్వైతంబు శైవంబసం
కోచప్రౌఢిమఁ దత్వనిశ్చిత జగత్ప్రోద్బోధంబుఁ గావింపనా
లోచించెన్ రమవాగ్వి గర్హితలుజా, లుల్ సభ్యు లోర్పుండిఁకన్. ౯౩
గీ. అని సభాస్తార కోటుల, ననున యించి కలశవారాశి తనయ చెంగటికి నరిగి
బాసవాల్దార వెల్లన, ప్పరమ సాధ్వియించుక మృదూక్తి లాలించి,యిట్టులనిరి.

———* మహర్షులు లక్ష్మీదేవికి శివతత్వముం దెలుపుట. *———

ఉ. కారణ తత్వ రాసులకుఁ, గారణమై జగదంత రాత్మయై
ప్రేరకుఁడై చరాచరవి, భేదవిశేష గుణావ ధానియై
పూరితకర్మ యంత్రఫల, భోగవిరాగ యుగస్వ తంత్రుఁడై
పారములేని సంసృతుల, పారమునొందఁగఁ జేయుతానయై. ౯౫
గీ. కాష్ఠగజ్యోతికరణి జొ, క్కముగనిఖలగతుఁడునై సర్వపరతాది, ఘనతఁబొలిచి
యప్రతర్క్యమనిర్దేశ్య,మప్రమేయమైన బ్రహ్మంబుశశిధరుం,డమ్మకొమ్మ. ౯౬
గీ. ప్రకృతిపురుషులకాదిమ. ప్రకృతియైన కాలమునకుమహాకాల, కలనఁ గూర్చి
తనప్రకాశమ్ముసర్వత,స్వప్రకాశకముగ భాసకభాసక, త్వమురహించె. ౯౭
సీ. అణువునకణువునై, యాది మధ్యాంతంబు లరయంగ రానిమ, మహత్తు
కల్పించి తాఁ జొచ్చి, కలయ నేకంబయై కలసి యున్నింటిపైఁ, గలయ తాక
తారకజ్యోతియై, తరుణార్క సాహస్ర దివ్యప్రభావళి, దీపులడఁగ,
అతుల బాహ్యాభ్యంతర, రాఖండసచ్చిదా పోజ్యోతిరాత్మయై, పొలిచినిలిచి.

గీ. గుణములకు నందరాకని, ర్గుణపరాత్మ భావసంప్రతి పన్నస్వ, భావు లకును
కొంగు బంగార మైనయ, క్కోండ విూటి దంట మహిమంబుఁ దెలి యంగిద
రమటమ్మ ౯౮

క. భేదత్ర యరహిత మ్ముశ్రుతి నాదా తీతమ్ము నిత్య, వైభవము మహా
వేదాంత ప్రతిపాద్యము నాదా తీతమ్ము ప్రమథ, నాధుండమ్మా. ౯౯

క. తత్త్వాహంకారమహా త్తత్వంబుల మాయ తోడఁ, దనలో నిడియ
త్తత్వంపద లక్ష్యార్థము సాత్వికుఁ డీశ్వరుఁడటం చుఁ, జనువుదురబలా. ౧౦౦

క. లోకంబులు లేవుతఁడా లోకంబులు లేవుసకల, లోకా ధిపులుం
లోకస్రష్టలు లేరొక కేకద్వజజనకుఁ డవల, కేకలువేయఁగ. ౧౦౧

గీ. అట్టిమప్రాకృతజ్యోతి, యఖిలసాక్షి యాత్మ రేశ్వరుఁడాత్మైక్య, హేతువైన
చంద్రశేఖరుతత్వంబు, సకలలోకసుప్రసిద్ధంబు నిగమసంస్తుత్యమమ్మ. ౧౦౨

ఉ. ప్రాకృత సాఖ్య సంపదల, పైమదిఁ జెట్టక స్వస్వ రూపవే
ద్యాకలి తస్వ భావుఁడయి, యట్లు జరించుటె కాని కేవలా
ప్రాకృత దివ్య వైభవము, పారము తత్కరు గాలవాప్తిన
స్తోకవిభూతి నందుటలు, చోద్యమె సర్వసు రాసు రాళికిన్. ౧౦౩

క. అద్దేవునియాదలకిం, చిద్దశ మింద్రాది సురల, సిరులకు మూలం
బద్దేవు ముద్దు కొమరుం, డద్దిర నీకల్లుఁ డవుట, యది యసదానె. ౧౦౪

వ. అదియునుం గాకభవదీయ వాక్తరంగిణీత రంగంబులం బోలుశశి ధరజగిద్ధురంధ రితాసముల్లంఘన జంఘాలంబులగు శబ్దకదంబులనుపామరోత్ప్రేక్షు సొల్లుంత నసూచకంబు లయ్యునంత ర్యాణుల కనంతసముల్లాసుచకంబులై నిరంతరా నుస్యూతచరమ పరమ పదార్థ విరమ సౌఖ్యంబావహించె, ననాదిత్వంబున వ్యాకృతపరతత్వంబును పరత్వంబునుగుణరాహిత్యంబున నిర్ద్వైత్వంబునుకా రణకారణత్వంబును, కేవలతత్వంబును జగద్విలక్షణత్వంబును సర్వసమత్వం బును, నసంబంధిత్వంబునప్రమేయత్వంబును ననాథ్యత్వంబువిశ్వభోజ కత్వం బునగోచరత్వంబును సర్వగత్వంబును మొదలగు నిర్విశేష బ్రహ్మార్థంబునకు సముద్యోతకంబులై యస్మదాదులకు బ్రహ్మానందంబు త్రావించె మఱియు భేదసాధకంబులగు చేష్టాచక్షుష్యంబులు లోకంబుల నఖిల జీవోపకారంబులై యప్పరమేశ్వరు లీలావిభూతుల నిరుద్ధమ్ములైయఘటితఘట నాపటియ్యంబు

